ప్రగతి కొరకు ప్రణాళిక

# ప్రజాస్వామ్యపు సంఘ స్థాపనకై ప్రయత్నం











మన దేశములో, జనుల జీవనప్రమాణము వృద్ధిచేసి భాగ్యవంతమును వైవిధ్యమును కలుగు జీవిత సదవకాశములను వారికి కలిగించుటయే ప్లానింగ్ ముఖ్యోద్దేశము.

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951–56) పరిణామము:

- అధిక ఆహారము
- అధిక వస్తూత్పత్తి
- ఉత్తమ రకము సాంఘిక సేవలు
- ఎక్కువ ఉద్యోగములు
- అత్యధిక జీవన ప్రమాణములు

రెండవ పంచవర్ష ప్రణాళిక (1956-61) లక్ష్యము:

- జాతీయ ఆదాయాభివృద్ధి
- అతిత్వరగా పారిశ్రామికాభివృద్ధి
- ఉద్యోగావకాశముల విస్తరణ
- ఆదాయము-సంపత్తులలోగల వైషమ్యములను తగ్గించుట
- ఆర్థిక శక్తిని సమముగానుంచుట




## మా రెండవ పంచవర్ష ప్రణాళిక

జాతీయ సౌభాగ్యము కొరకు

DA 56/52 TG

భారతీయ లక్షణము కొరకు...

# ఎట్టి వస్త్రాలు మీరు ఎన్నుకుంటారు?



- ఆకర్షణీయమగు రంగుల మేళవింపులతో బీహారు, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ మరియు మద్రాసుల నుండి సుందరమగు నమూనాలతో తెరలు.
- అస్సాము, బీహారు, ఒరిస్సా, హైదరాబాదు మరియు పంజాబు నుండి భారతదేశపు సాంస్కృతిక ఆలేఖనములతో కూడిన టాపెస్ట్రీలు మరియు 'ఖాన్.'
- మద్రాసు, మైసూరు, ఉత్తర ప్రదేశముల నుండి మెరిసే రంగులలో వివక్తములగు ఆలేఖనలు కలిగిన తివాసీలు, దర్రీలు.
- మీ బల్ల అలంకరణకు ఇంద్రజాలాన్ని కల్పించే బల్ల గుడ్డలు, భోజన సమయాల్లో ఉపయోగించే చాపలు.
- అతి సుందరముగా నుండి వాడుకొనుటకు ఆహ్లాదకరముగా నుండే తువ్వాళ్లు ఒడిగుడ్డలు.

## చేనేత వస్త్రాలు

## విశిష్టతకు పూచీ




అల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు

98, మౌబ్రేస్ రోడ్, మద్రాసు; 18 షాహిబాగ్ హౌస్, విట్టెట్ రోడ్, బెలార్డ్ ఎస్టేట్, బొంబాయి & 7/192 స్వరూపనగర్, కాన్పూర్.

# ఆంధ్ర మహిళ

సంపుటి 13 :: సెప్టెంబర్ '56 :: సంచిక 9

వ్యవస్థాపకురాలు :
శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

సంపాదకురాలు :
శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

ముద్రణ :
ఆంధ్ర మహిళా ప్రెస్



## విషయసూచిక




సంపుటి 13 :: సెప్టెంబర్ 56 :: సంచిక 9

# శాంతి భగ్నమా? కింకర్తవ్యమా?

బొంబాయిలో బయలుదేరిన దుమారము తుపానుగా చెలరేగింది. పరిణామము ముఖ్య మంత్రి ఉపవాసదీక్ష. దీక్ష విరమణ ఆచూకి కనబడుట లేదు. విద్యార్థులు నిరాహార దీక్షజట్టులు జట్టులుగా సాగిస్తూనే వున్నారు. మొరార్జీ భాయి మాటలు వినేవా రెవ్వరు! బొంబాయి సమస్య భాషా రాష్ట్ర విభజనకు ముసలముగా తయారు గాకుండు గాక.

దేశములో శాంతిలేదు. ప్రపంచములో యుద్ధ దేవత పొడచూపింది. సూయజ్ సమస్య ఈజిప్టు సమస్యయే కాకుండా ప్రపంచ సమస్యగా పరిణామము పొందింది. భారత రాజీపథకము కుదర లేదు. కృష్ణ దౌత్యము విఫలము. అగ్రరాజ్యాల వారికి పదునేడు రాజ్యాల మద్దతు లభించింది. ఇట్లుండగా భారతదేశము కామనువెల్తులో నుండి విడిపో గలదనే ఊహాగానము కొందరు సాగిస్తున్నారు.

భారత ప్రతిపాదన కాదని, పాశ్చాత్యరాజ్యములు డల్లెస్ ప్రతిపాదననే పట్టుకుని వ్రేలాడితే యుద్ధము తథ్యము. ఈ సమస్య శాంతి యుతంగా పరిష్కారము కావటము భారత దేశమువాంఛ. ప్రపంచ వాంఛకూడా అదే. అయినా మొండిపట్టు ఎవరుపట్టినా ఆయా దేశాలను మాత్రమే కాకుండా యుద్ధ జ్వాలలు ప్రపంచమంతటినీ చుట్టిముట్టగలవు. లండను సభ విఫలమైంది. మెంజిస్ కమిటీతో చర్చలకు నాజర్ అంగీకరించే సూచనలు కనబడుటలేదు.

పరిస్థితులు విషమించ కుండా ఇప్పుడైనా వివిధ దేశాలు సర్వదేశాల సహకారముతో ఈ సూయజ్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించగల శాయశక్తులు భగవంతుడు ప్రసాదించ వలయుననియే మాప్రార్థన.

దేశములో, ప్రపంచములో అనతి కాలములోనే తిరిగి శాంతి స్థాపన కాగలదని మేమూ, మా తోడి ప్రపంచస్త్రీలందరూ ఆశిస్తున్నారనే మా అభిప్రాయము.

---



# ఆంధ్ర మహిళా సభ

## వరలక్ష్మీవ్రతం

ఆంధ్ర మహిళా సభలో ఆగష్టు 17 వ తేదీని వరలక్ష్మీ పూజ జరిగినది. సభలోని బాలికలూ, నగరంలోని మహిళామణులు విచ్చేసి, పూజ అత్యంత వైభవోపేతంగా జరిపించిరి.

కల్యాణిరాగం — ఆదితాళం.

పాలించవే వరమంగే శుభమంగే మామవతత కల్యాణి ॥పా॥

పతిత పావనాంభోరుహాచరణే పంకజాసనే శశినిభ వదనే!
పాలితభువనే కరుణాభరణే పరిపూర్ణమయ వక్షస్థలసదనే ॥పా॥

దేవరమణి కలశజలనిధి రమణి కలితదివ్యమాలా వర మణిభూషణా
దుర్లిశాల సర్వనాలి హర్ష విశాల పద్మనయనే! ॥పా॥

నేను—సహ మాలాశయనే దివ్యకలభయుగ శ్రీతాళిసేచనే
దేవదేవనుతే పరమాద్భుతచరితే సురమునివరగణ పూజితే! ॥పా॥

* * * *

వరలక్ష్మి నీ వ్రతమును చేయనెంత భాగ్యమమ్మా!
కర్పూరహారతులు అమ్మనీకు అమర్చినాను
వేగరమ్మ ఆరగింప సింహవాహినైన దేవి! ॥ వ ॥
పండ్లు ఫలహారములు అమ్మనీకు అమర్చినాను
వేగరమ్మ ఆరగింప శరణు జొచ్చినాను తల్లి ॥ వ ॥

# ఆంధ్ర మహిళా సభ

## స్వాతంత్ర్య దిన వేడుకలు



పతాకావిష్కరణ

ఆ రోజు ఆగస్టు పదిహేనో తేదీ – అఖిల భారత స్వాతంత్ర్య పుణ్యదినం...భారత ప్రాంగణాలన్నీ పచ్చ పచ్చగా కలకలలాడే పవిత్ర దినం — భారతీయులందరికీ పండుగదినం –

ఆవిష్కరించబోయే త్రివర్ణ పతాకమైనా ఆ నాడు ఆంధ్ర మహిళా సభా ప్రాంగణంలో ఎక్కడ చూచినా శ్వేత వస్త్రాలంకృతలే శాంతయుతంగా కన్పించారు.

ఉదయం 10–30 కు శ్రీ డాక్టర్ స్వామి పతాకావిష్కరణ చేశారు...సభా సభ్యుల జాతీయ గీతాలాపనతో...సభా కార్యదర్శిని శ్రీమతి కె. ఎల్. ప్రసూనాంబగారు వందన సమర్పణ చేశారు. జనగణమనతో ఆ కార్యక్రమం ముగిసింది. ఆ రోజునాడే సభ యొక్క వివిధ శాఖల విద్యార్థినులకు జాతీయగీతాల పోటీ జరిగింది...చాలామంది ఉత్సాహంతో పాల్గొన్నారు...ఈ పోటీలో విజయమందిన ముగ్గురికి రాబోయే దసరా వేడుకల్లో బహుమతులివ్వబడతాయి.



డాక్టర్ స్వామిగారికి శ్రీమతి వి. తిమ్మాబాయిగారు, సభాకార్యదర్శిని, స్వాగత మిచ్చుచున్నారు.



## మనలో మనమాట

# ఖబడ్దార్!

శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

బొంబాయి మహాపట్టణములో మొన్న ఉదయము ఒక పెద్ద రోడ్డులో ఒక వ్యాపారి "కేశసంవర్ధని" తైలము అమ్ముతున్నాడు. చుట్టూ జనము-అందులోను బట్టతలల వారు-మూగారు. తనతైలము అచ్చమైన హిమాలయా మూలికలతో తయారైన సిద్ధౌషధమని, జనము—దాని కోసము ఎగబడుతున్నారని వ్యాపారి అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు.

ఇంతలోకే ఒక ముప్పుముంచుకొని వచ్చింది. ఒక ఆడ మనిషి జనాన్ని తోసుకుంటూ వచ్చి, గంభీరంగా వ్యాపారి దగ్గరకు వెళ్లి ఆయన తలపై వున్న టోపిని లాగి వేసింది. కేశవర్ధని అమ్ముతున్న ఆవైద్యరాజుది పూర్తిగా బట్టతల! —అని పత్రికా వార్త.

రామ. రామ! ఏమి సాహసము. నడి వీధిలో ఒక స్త్రీ ఒక పురుషుణ్ణి పట్టుకొని తలపై వున్న టోపీని లాగి వేసినదా? ఔరా! అబలగాని సబలకెంతటి సాహసము.

అలనాడు జంఘాల శాస్త్రియన్నట్లు — "మీ పూర్వ కాంతలొక విలక్షణమగు జంకునకు, గాసంత తొట్రుపాటునకు—రవంత తడబాటునకు నాధీనలై యుండెడి వారు. ఇప్పటి మాసోదరీమణులలో—యెట్టి పరపురుషులను జూచినప్పుడైన—వారితో సంభాషించవలసి వచ్చినప్పుడైన—నట్టి కొంకు, వెనుకపాటు, సంకోచము లేక ప్రవర్తించుచున్నారు. అట్టి సమయములందు మీ బుగ్గలట్టె రవంతయెరుపైన నెక్కకున్నవి. కన్నులట్టె కాసంతయైన వ్రాలకున్నవి. దేహమట్టె యిసుమంతైన సంకోచింపకున్నది.... బంగారు కేతకీవంటియొడలి రంగుకంటె రపురుష దర్శనమున సాధ్వసపు దొట్రుపాటున మనస్సునుండి చెక్కుల తుదలవరకొక్క సారి మెరసిన కెంపుటారవున్నదే—అదియే యాడుదానికి సౌందర్యలక్షణాగ్రగణ్యము".

సరిసరి ఏదో పరపురుషునితో మాట్లాడునప్పుడు కొంచెము జంకు మరికొంచెము సిగ్గు, ఇంకొంచెము సంకోచముండవలెనని శాస్త్రిలుగారు అంటున్నారు. కాని, ఆయనగారు బొంబాయిలో వుండి ఆపై చెప్పబడిన కేశవర్ధని వ్యాపారి సంఘటన చూచి వుంటేఆ స్త్రీబదులుకు శాస్త్రిలుగారే బ్లష్ అయి(చెక్కులు ఎరుపెక్కి)వుండే వారేమో! కాని కొంచెము గ్రుడ్డిలోమెల్లఅన్నట్లు ఆ స్త్రీ వ్యాపారి భార్యయే యని తెలిసిన తరువాత జంఘాల శాస్త్రికి సైతము కొంత మనశ్శాంతి కలిగి యుండవచ్చు. ఆ వ్యాపారి ధర్మరాజువలె భార్యను సభామంటపములోనికేల వచ్చితివని నిందిచనూ లేదు.

ఇంతకీ ఆ స్త్రీ ప్రత్యక్షదైవమైన పతిగారి టోపీ వూడబెరికి వూరుకోలేదట—'ఆమె చండికలాగా ద్విముఖ అయిన గ్రీక్ జనుస్ దేవతలాగా మండిపడుతూ జనంపైపు తిరిగి "ఈతైలము నిజంగా అమోఘమైతే ఈయన తలెందుకు బట్టగావుంది?" అని ప్రశ్నిస్తూ ఆవ్యాపారివైపు తిరిగి "ఇదేనీకు తగిన శాస్తి నాకు చీరె కొంటాననిచెప్పి మాట దక్కించుకోకపోతే ఇదే గతి" అని అన్నదట—ఆమె ఆవైద్యరాజు భార్యేనని పత్రిక కథనుముగించింది.

అంతమట్టుకు నయమే—ఎవరో పరస్త్రీ చేయకుండా ఈ బుద్ధి చెప్పటము భార్యే చేసింది. భర్తలూ! ఖబడ్దార్! కొంటానని చీరెలు, నగలు కొనకపోతే భర్తల కింతే శాస్తి కావచ్చు, స్త్రీలకు ఆస్థి హక్కులబిల్లుతో భర్తలకు

ఈ బెడదతీరి పోతుందా? అసలు కొనిఇస్తానని మాట ఇవ్వకపోతే మరీ మంచిది.

ఇంట గెలువలేని వ్యాపారి రచ్చగెలువగలుగు తాడా? ఇంట్లో భార్యను సమాధానము చేసుకోలేని వాడు కేశవర్ధని అమ్మివారిలోని స్త్రీలకందరికీ సమాధానము చెప్పగలడా? ఇంట్లో 'ఏయి ఈయి' అనే శ్రీ వారు సభావేదిక మీద స్త్రీలహక్కులను గురించి ఫండమెంటల్ హక్కులను గురించి ఏక ధాటిగా ఉపన్యసించగలడా. లంచములు తీసికొని క్లబ్బులలో సుఖంగా లక్షాధికారివలె జూదము పేకాట ఏ ఉద్యోగి ఆడగలడు. అన్యకుల పంక్తిని భోజనము చేయని వాడు కంఠ శోషచేసు కుంటూ కులమత భేదముల నిర్మూలన మీద ఉపన్యసించ సాహసించ గలడా? ఇదివరకు సాహసించినా ఇప్పుడు ఈ కేశవర్ధని వ్యాపారి ఈ సంఘటన తరువాత సాహసించడనే మా విశ్వాసము. కథానాయకి భార్య కాకపోతే ఒకప్పుడు కుమార్తె కావచ్చు. మరొకప్పుడు కోడలూ కావచ్చు. కాబట్టి జాగ్రత్త అవసరమే.

అంతవరకూ బాగానే వున్నది. కాని అసలా 'భార్యామణి భర్త చీరె కొనకపోతే మట్టుకు బజారున పడట మేమిటి? అట్లా ఆయనగారి సంగతి బట్ట బయలు చేసితే బుద్ధి వచ్చి తనకు చీరె కొనిపెట్టగలడనుకుందా లేక సామదానభేదోపాయాలు ముగించి ఈ నాలుగో ఉపాయము బహిరంగంగా ఉపయోగిస్తే అంత ప్రమాదము కాకుండా ఫలదాయకము కాగలదని ఆశించిందా? సాధారణంగా ఈ సంఘటనలు ఇంట్లో జరిగితే చాలా రసవంతంగా మనోజ్ఞంగా వుంటవి గాని నడి వీధిలో, "ఫ్రీ షో" లిస్తే చాలా అసహ్యంగా వుంటవి. దాని వల్ల ఏమీ ఫలితము లేకపోగా భర్త మొండి ఘటమై తిరగ బడితే ప్రమాదము కూడా రావచ్చు.

చతురోపాయములను సావధానముగా సతులు పతుల మీద గృహాంగణములోనే ప్రయోగించ వలసినదిగా మాసలహా.

మనలో మనమాట ఆ వ్యాపారికి ఇది ఒక కొత్తరకపు అడ్వరుటైజు మెంటు స్టంటు కాదు కదా!

---

# వరద గోదావరి

శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రి

గద్దించి చూచింది
గోదావరీ-తాను
గద్దెపై లేచింది
గోదావరీ ॥

ఉరి మురిమి చూసింది
మెర మెరిలె దూసింది
ఉద్దండ పిడుగులా
దద్దరిలి మ్రోగింది ॥

ఇద్దరిని అద్దరిని
బద్దెల్ల ఊపింది
బద్దెలను మీటి-సరి
హద్దుల్లె దాటింది ॥

నా యంత నదినినే
నే-యన్న పొంగుతో ;
చెంగు చెంగున ఎగిరి
నింగి ముట్టిందీ ॥

ప్రళయ కాల పయోధి
పగిని గర్జించింది
ధణధణై ఝుణ ఝుణై
తాండ వించిందీ ॥

గద్దించి చూచింది
గోదావరీ
గద్దెపై లేచింది
గోదావరీ ॥

# భీమా సంస్థలు

భీమాసంస్థ మనదేశములో అతి పూర్వ కాలమునుండి వున్నది. కానిదాని పూర్వ చరిత్రను గురించి మనకేమియు స్పష్టమైన భోగట్టా లేదు. మనుధర్మశాస్త్రములో ఒక భాగమైన మానవ ధర్మశాస్త్రములో భీమాను గురించి చెప్పియున్నారు. ఋగ్వేదములో భీమా అను అర్థమిచ్చు యోగక్షేమం అను పదమును వాడియున్నారు. వీటివల్ల మన దేశములో సంఘములోని వారందరికి అనుకూలమైన భీమా ఏదో ఒక రూపమున మూడువేల సంవత్సరములకు ముందునుంచి వున్నట్లు ఋజువగుచున్నది.

అపుడు సంఘములో నష్టము గాని మరణము గాని సంభవించి నచో దానిని సంఘములోని వారందరు పంచుకొనుటకే భీమాలు వుండేవి. ఇట్టి సంఘభీమాలు లాభదాయకముగా వున్నందున బౌద్ధయుగమున చావు భీమాలు ఏర్పడినవి. సంఘములోని వాడెవ్వడైనను మరణించిన యెడల వాని కుటుంబమునకు యిల్లు కట్టియిచ్చుటకు, వాని భార్యా బిడ్డల పోషణకు, వాని బిడ్డల వివాహఖర్చులు భరించుటకు వాని పిల్లలకు విద్య చెప్పించుటకు, వాని మగబిడ్డలకు వృత్తులు నేర్పుటకు యిట్టి భీమాలు తోడ్పడేవి. 20 వ శతాబ్దము వరకు ఇటువంటి యోగక్షేమసంఘము రాజస్థాన్ లో వుండేది కుటుంబపు ఆస్తులుకోల్పోయిన ప్రతికుటుంబమునకు నగదుగా ఒక రూపాయి యిల్లు కట్టుటకు పనికివచ్చు ఒక రాతిపలక యింటిలి సభ్యులు యిచ్చు షరతులకు ఒప్పుకొన్న వారికే యీ సంఘములో సభ్యత్వం వుండేది. ఈ ప్రదేశములలో రాతిపలకలకు ఖరీదు స్వల్పమే గాని, వాటిని యిల్లుకట్టు స్థలమునకు మోసుకపోవుట శ్రమకరముగా వుండేది. సంఘములోని వారిచ్చిన ధనము పోయినవారు తిరిగి తమ వ్యాపారమును స్థాపించుటకు మూలధనముగా వాడేవారు. ఇట్టి ప్రయోజనకరమైన కార్యములకొరకే దేవాలయములలోను, ధర్మకార్యములు నిర్వహించు సంస్థలలోను, చందాలు వసూలు చేసేవారు. సమిష్టి కుటుంబములు కూడ కుటుంబ స్థులకు సహాయపడేవి

కొన్ని సంవత్సరములు భీమా వ్యాపారము మనదేశములో జయప్రదముగా (లాభకరముగా) జరుగలేదు. గాని మొదటి ప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత పరిశ్రమలు అత్యధికముగా అభివృద్ధి చెందినవి. జాతీయాభిమానము ఉద్యమములు వృద్ధి అగుటవలన చాలామంది ప్రముఖులు క్రొత్త భీమా కంపెనీలను లేవనెత్తిరి.

మానవుల క్షేమమునకు, భద్రతకు, అభివృద్ధికొరకు చేయ వలసిన ప్రయత్నములన్నిటిని కృషి చేయుచున్నారు. స్వాభావి కమైన అపాయమువలన, మనుష్యకృతమైన అపాయము వలన కలుగు నష్టకష్టములను నివారణోపాయములు కనిపెట్టు టలో మానవులు కృషి చేయుచునే యున్నారు. కొన్ని అపాయములు జరుగకుండా తప్పించుకొనవచ్చును. తప్పిం చుకొనుటకు వీలులేని అపాయములకు సంఘమే సహాయపడు చున్నది.

భీమా సంఘములు ఎంత మనఃపూర్వకముగా పరిశ్రమ చేసినను ప్రయత్నించినను ప్రజలకు భీమా కంపెనీలయందు విశ్వాసము కలుగలేదు.. భీమా అంటే యేమిటో కొద్దిమందికే బోధపడ్డది. కాని అట్టి కొద్దిమంది బుద్ధిమంతులు కూడా దాని విలువను ప్రయోజనములను కనుగొనక పోయిరి.

బరువు సామానులు మోయుటకు ఏనుగయే ముఖ్యాధారమైన ఒక దేశములో ముగ్గురు గుడ్డివారు (హిందువులు) వుండేనారు. వారు పుట్టుగుడ్డివారు కనుక వారికి ఏనుగ స్వరూపమేమిటో తెలియదు. ఒకరోజున వారు ఏనుగ ఆకార మెట్లుంటుందో తమలోతాము చర్చించిరి. వారు ఏనుగ ఎట్లుంటుందో తెల్సుకొనుటకు కస్తామీడకు పోయి ఒక ఏనుగ వద్దకి పోయిరి. అందులో ఒకడు ఏనుగయొక్క పెద్ద శరీరమును ముట్టుకొన్నాడు. రెండవవాడు ఏనుగ తొండమును పట్టుకొన్నాడు. మూడవవాడు ఏనుగతోకను పట్టుకొన్నాడు. అటుపిమ్మట వారు మరలు కొన్నారు. మొదటివాడు ఏనుగ శరీరము నున్నగా గోడవలె నున్న దన్నాడు. రెండవవాడు మొదటివానితో యేకీభవించక చెట్టు మొదలువలె ఏనుగ వున్నదన్నాడు. వీరిద్దరితోను ఏకీభవించని మూడవవాడు ఏనుగ లావైన త్రాడువలె వున్నదన్నాడు.

(తరువాయి 12 వ పేజీలో)



# రాజకీయాలు

శ్రీ జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య

### తిరిగి భూకంపం

జులై 18 వ తేదీని సంభవించిన భూకంపం ఫలితంగా కచ్ ప్రాంతంలోని అనేక గ్రామాలు, పట్టణాలు, ప్రజలు నష్టపడి విలపిస్తూవుంటే గోరుచుట్టుపై రోకటిపోటులా 25 వ తేదీ ఉదయం 10-50 లకు మరొకసారి భూకంపం సంభవించింది. జులై 27 న ఉదయం 11-30 లకు మరో భూకంపం జరిగింది. ఈ మూడు భూకంపాలవల్ల మొత్తం 119 మంది మరణించారు. 300 మందికి పైగా గాయపడ్డారు. 1300 యిళ్ళు కూలిపోయాయి, 2000 యిళ్ళకు పైగా దెబ్బతిన్నాయి. ఒక రైలువంతెన కూలింది. ఇంకా పంటలకు, తోటలకు, పశువులకు కలిగిన నష్టం అంచనావేయబడుతూనేవుంది.

ప్రకృతి జన్యమైన విపర్యాయాలలో ఒకటి అనదగ్గ ఈ భూకంప ఫలితాన్ని ప్రధాని నెహ్రూ యిటీవల స్వయంగా చూసివచ్చారు. ఆయన పయనించిన జీప్‌కు కించిత్తు ప్రమాదం సంభవించి దెబ్బతగిలి, 'భూకంప ప్రభావం తనకుకూడా సోకింద'ని ఛలోక్తి విసిరారుకూడా.

### స్టేట్ ఆఫ్ అండమాన్స్

భారత దేశంలో నిర్మించబడిన తొలి ప్రయాణీకుల సరకు నౌక 'స్టేట్ ఆఫ్ అండమాన్స్'కు హిందూస్తాన్ నౌకా నిర్మాణ కేంద్రంలో జులై 25 న ప్రారంభోత్సవం జరిగింది. ఈస్టర్న్ షిప్పింగ్ కార్పొరేషన్ వారు దీనిని కలకత్తా-అండమాన్స్- మద్రాసుల మధ్య నడుపుతారు.

### కృష్ణా నదికి తిరిగి వరదలు

కృష్ణా నదికి తిరిగి వరద ప్రమాదం ఏర్పడినందున జులై 28 న బందరు దగ్గర పులిగడ్డ అక్విడక్టుపై రాకపోకలు నిలిచిపోయినవి. కృష్ణ ఆనకట్టపై జులై 30 వ తేదీని నీటిమట్టం 18.36 అడుగుల ఎత్తు లేచింది. బుడమేరుకు కూడా వరదలు సంభవించాయి. దాదాపు లక్ష యకరాలలో పైరు నష్టం సంభవించినట్లు అంచనా వేయబడింది. గుంటూరు సీమలోని కొన్ని పల్లెలు కూడా మునిగాయి. కృష్ణా జిల్లాలో అయిదు తాలూకాలు గట్టి దెబ్బ తిన్నాయి.

అటు గోదావరిలో కూడా వరదలు సంభవించి పోలవరం, భద్రాచలం గ్రామాలకు, మరికొన్ని యితర గ్రామాలకు పంటలకు కూడా నష్టం సంభవించింది.

శ్రీకాకుళంలో నాగావళినది, వంశధార నదుల వరదల మూలంగా 60 గ్రామాలు నష్టపడ్డాయి.

అస్సాంలో గోమతి, సింగ్లా నదుల వరదలవల్ల త్రిపుర అస్సాంల మధ్యవున్న రోడ్డు మునిగిపోయింది.

బీహార్‌లో వరదలవల్ల 1200 చదరపు మైళ్ళు జలమయమైనాయి. ఇటు హైదరాబాదు స్టేట్‌లో ఖమ్మం జిల్లా, వరంగల్ నగరం కూడా వరద మూలంగా దెబ్బ తిన్నాయి. ఇది జలప్రళయం కాదుగదా!

### సరిహద్దుల వివాదాలు

రాష్ట్రాల మధ్య సరిహద్దుల వివాద పరిష్కారానికి ప్రత్యేకంగా కమీషన్ నియామకం జరగదని ఇండియా ప్రభుత్వ హోం మంత్రి పండిట్ గోవింద వల్లభపంత్ జులై 31 వ తేదీని లోక్‌సభలో ఒక ప్రకటన చేశారు. అటువంటి కమీషన్‌ను ఏర్పాటుచేస్తే వివాదాలు యింక తెంపు లేకుండా సాగగలవన్నారు. మండల సంఘాల ద్వారా ఆ వివాదాలు పరిష్కారం కాగలవన్నారు. ఆర్థిక మంత్రిపదవికి రాజీనామాఇచ్చిన శ్రీ చింతామణిదేశ్‌ముఖ్ ఆరోపణలకు సమాధానమిస్తూ బొంబాయి నగర భవితవ్యంపై కేంద్ర మంత్రివర్గం మొత్తం 14 సమావేశాలు

చర్చించి వున్నదన్నారు. దీనికి శ్రీ దేశ్‌ముఖ్ సమాధాన మిస్తూ బొంబాయిపై నిర్ణయాలు మంత్రివర్గం నిర్ణయాలు కావని, దీనికి తగిన నిదర్శనలు తనవద్ద కలవని చెప్పి ప్రధాని నెహ్రూ తనకు వ్రాసిన లేఖలోని కొన్ని భాగాలు చదివి వినిపించారు. పెక్కుమంది సభ్యులు, బొంబాయిని ద్విభాషా రాష్ట్రంగా నిర్మించాలని సూచించారు.

### అణుశక్తి ఉత్పత్తి

ఆగస్టు 4 వ తేదీని బొంబాయికి చేరువగావున్న ట్రాంబేలోని అణుశక్తి కర్మాగారంలో తొలిసారిగా అణుశక్తి ఉత్పత్తి అయిన సందర్భంలో భారత ప్రధాని పండిట్ నెహ్రూ ఒక సందేశం పంపుతూ దేశ చరిత్రలో యిది మహత్తర సంఘటన కాగలదన్నారు. ట్రాంబేలో అణుశక్తి ఉత్పత్తికి 'ఈతకొలను' తరహా (స్విమ్మింగ్ పూల్) రియాక్టర్ నెలకొల్పబడింది. కెనడా సహాయంతో 1957 లో మరొక రియాక్టర్ నెలకొల్పబడుతుంది. ఈ తొలి రియాక్టర్‌ను భారతీయ శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు కలిసి ఒక్క సంవత్సరంలో తయారు చేశారు. దీనికి కావలసిన ఇంధన ద్రవ్యాలను బ్రిటన్ సప్లయి చేసింది.

### బృహత్తర బొంబాయి రాష్ట్రం

మహారాష్ట్ర, గుజరాత్, సౌరాష్ట్ర, మరాఠ్వాడా, విదర్భ, కచ్ ప్రాంతాలతో బొంబాయి నగరం రాజధానిగా బృహత్తర ద్విభాషారాష్ట్ర నిర్మాణానికి ఇండియా ప్రభుత్వం నిర్ణయించినట్లు హోం మంత్రి పండిట్ గోవింద వల్లభపంత్ ఆగస్టు 7 వ తేదీని అధికార పూర్వకంగా లోక్‌సభలో ప్రకటించారు.

దీనికి పార్లమెంటు సభ్యులు అనేక మంది హర్షించారు. మాజీ ఆర్థిక మంత్రి శ్రీ దేశ్‌ముఖ్‌గారు సంతృప్తిని ప్రకటించారు.

### పశ్చిమ బెంగాల్ గవర్నర్ కాలధర్మం

పశ్చిమ బెంగాల్ గవర్నర్ డాక్టర్ హరేంద్రకుమార్ ముఖర్జీ ఆగస్టు ఏడవ తేదీ ఉదయం హృద్రోగం మూలంగా మరణించారు. ఆయన వయస్సు 79 ఏళ్ళు. ప్రెసిడెంట్ ప్రసాద్, ప్రధాని నెహ్రూ, కాంగ్రెసు నాయకులు, తదితర ప్రముఖులు సానుభూతి సందేశాల నందజేశారు.

### గుజరాత్‌లో కల్లోలం

ఎప్పుడైతే బొంబాయిని ద్విభాషా రాష్ట్రంగా చెయ్యడానికి ఇండియా ప్రభుత్వం నిర్ణయించి, తన నిర్ణయాన్ని ప్రకటించిందో అప్పుడే గుజరాత్‌లో కల్లోలం ప్రారంభమయింది. ఆగస్టు ఎనిమిదవ తేదీని అహమ్మదాబాద్‌లో 85,000 మంది విద్యార్థులు తమ తమ తరగతులనుంచి బయటకు వచ్చి వేశారు. పెక్కు చోట్ల అసమ్మతి ప్రదర్శనలు జరిగాయి. హర్తాళ్ జరిగింది. ప్రదర్శకులపై పోలీసులు కాల్పులు జరపవలసి వచ్చింది. కాల్పుల ఫలితంగా 17 మంది మరణించారు. 128 మంది గాయపడ్డారు. అహమ్మదాబాద్‌లో కర్ఫ్యూ విధించబడ్డది.

ఒక వంక కల్లోలం రేగుతూ వుండగానే లోక్‌సభ బృహత్తర బొంబాయి రాష్ట్ర నిర్మాణానికి తన ఆమోదం తెలిపింది.

దేశానికి తలవంపులు తేవలదని గుజరాత్ ప్రజలకు హోం మంత్రి పండిట్ గోవిందవల్లభ పంత్ విజ్ఞాపన చేశారు కూడా.

### జనరల్ ఎన్నికల పోలింగ్

1957 ఫిబ్రవరిలో జరగనున్న జనరల్ ఎన్నికల సందర్భంగా పోలింగ్ ఫిబ్రవరి మొదటి తేదీనుంచి 15 వ తేదీ నాటికి పూర్తి కాగలదని ఎన్నికల కమీషనర్ తాత్కాలికంగా నిర్ణయించారు. ఈ నిర్ణయం ఆగస్టు 11 న జరిగింది.

### స్వాతంత్ర్య దినోత్సవం

ఆగస్టు 15 న యావద్భారత దేశం మహావైభవోపేతంగా నవమ స్వాతంత్ర్య దినోత్సవం జరుపుకొంది. ఈసంవత్సరం ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాద్ మద్రాసులో వుండడంవల్ల రాజలాంఛనోచితంగా జరపబడిన ఈ ఉత్సవంలో మద్రాసులోని లక్షలాది ప్రజలు పాల్గొన్నారు. ఢిల్లీలో ప్రధాని నెహ్రూ లాల్‌ఖిల్లాపై జాతీయ పతాకను ప్రతిష్ఠించారు. జాతీయసంపదను పెంపొందించుకొంటూ దేశ సమైక్య సాధనకు దీక్షవహించాలని, దేశీయ సమస్యలను పరిష్కరించుకొన్నపుడే విదేశాలలో కీర్తి ప్రతిష్ఠలు హెచ్చగలవనీ ప్రెసిడెంట్ ప్రసాద్ మద్రాసులో జరిగిన మహాసభలో ఉద్ఘాటించగా ఢిల్లీ సభలో ప్రధాని నెహ్రూ అంతర్జాతీయ పరిస్థితులను సమీక్షిస్తూ సూయజ్ కాలువ వివాద సమస్యను శాంతియుతంగా పరిష్కరిం

చాలేగాని బలప్రయోగం ఎంతమాత్రం తగదని పేర్కొన్నారు.

వార్తా పత్రికల వెలల బిల్లు

వార్తా పత్రికల వెలలను పేజీల సంఖ్యను బట్టి నిర్ణయించే బిల్లును రాజ్యసభ ఆగస్టు 14 వ తేదీని ఆమోదించింది. వార్తా పత్రికల పేజీలను వెలలను కంట్రోల్ చెయ్యడానికి ఈ బిల్లు ఇండియా ప్రభుత్వానికి అధికారమిస్తున్నది.

మైసూర్‌కు కొత్త ముఖ్య మంత్రి

మైసూరు ముఖ్య మంత్రి శ్రీ కె. హనుమంతయ్యగారిపై విశ్వాసరాహిత్య తీర్మాన ప్రతిపాదనకు యత్నం జరిగిన మీదట ఆయన యిచ్చిన రాజీనామాను మైసూర్ కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ ఆగస్టు 16 వ తేదీని ఆమోదించింది. కొత్త నాయకునిగా ప్రస్తుతం రెవిన్యూ మంత్రిగా వున్న శ్రీ కడిదళ్ మంజప్పగారిని ఎన్నుకొంది. మైసూర్ ముఖ్యమంత్రిగా ఆయన ఎన్నుకొనబడి ప్రమాణస్వీకారం చేశారు.

ఆంధ్ర ప్రదేశ్

నవంబర్ మొదటి తేదీ నాటికి ·అవతరించనున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి 12 మంది సెక్రటరీలు, ఒక రెవిన్యూ బోర్డు ఉండాలని ఆంధ్ర—తెలంగాణా మంత్రుల కమిటీ హైదరాబాద్‌లో ఆగస్టు 19 వ తేదీని సమావేశమై తుదినిర్ణయం చేసింది. ఛీఫ్ సెక్రటరీగా శ్రీ ఓ. పుల్లారెడ్డిగారు, ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా శ్రీ మోనప్పగారు ఆంధ్ర ప్రదేశ్‌లో అదే పదవులలో వుంటారు.

కచ్ సందర్శన

మూడు సార్లు భూకంపం సంభవించి నష్టపడ్డ కచ్ ప్రాంతాన్ని ప్రధాని పండిట్ నెహ్రూ ఆగస్టు 18 వ తేదీని దర్శించారు. నూరుమైళ్ళ మేరలో పర్యటన జరిపి, పెక్కు గ్రామాలలో జరిగిన సమావేశాలలో ఆయన ప్రసంగించారు.

శ్రీ మొరార్జీ నిరసనదీక్ష

గుజరాత్‌లో ఇటీవల రేగిన అల్లరుల సందర్భంగా అహమ్మదాబాద్ వెళ్ళి, అక్కడ బహిరంగ సభలో తాను ప్రసంగించ బూనగా ప్రజలు వినక అల్లరి చెయ్యడంతో బొంబాయి ముఖ్యమంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ ఆగస్టు 19 వ తేదీని నిరసన దీక్ష ధరించారు. అహమ్మదాబాద్ పౌరులు తాను చెప్పేది శాంతంగా వినేవరకు తాను తిరిగి ఆహారం తీసుకోనని ఆయన నిర్ణయించుకొన్నారు. ప్రధాని నెహ్రూ, కాంగ్రెస్ ప్రెసిడెంట్ తదితరులు వారించినా ఆయన తన కఠోర దీక్షను వదలలేదు.

ఆయన చాలా నీరసించి, ఆరోగ్యం క్షీణదశలో పడుతున్నదని డాక్టరులు తెలుపుతున్నారు.

హైదరాబాద్‌లోనే హైకోర్టు

గుంటూరులో వేరే బెంచిలేకుండా హైదరాబాద్‌లోనే హైకోర్టు ఏర్పాటు ఆంధ్ర తెలంగాణా మంత్రుల కమిటీ నిర్ణయించిందని వివరిస్తూ హైదరాబాద్ ముఖ్యమంత్రి డాక్టర్ బూర్గుల రామకృష్ణారావుగారు ఈ నెల 19 వ తేదీని ఒక ప్రకటన చేశారు.

కౌలుదారీ బిల్లుకు ఆమోదం

ప్రధానమైన కొన్ని మార్పులతో, ఆంధ్ర అసెంబ్లీ ఆగస్టు 23 వ తేదీని కౌలుదారీ బిల్లును ఆమోదించింది.

శ్రీ దేశ్‌ముఖ్ గారి కొత్త పదవి

ఆర్థిక మంత్రి పదవికి రాజీనామా యిచ్చిన శ్రీ చింతామణి దేశ్‌ముఖ్‌గారు యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ అధ్యక్షులుగా నియమించబడుతున్నారని, ఈ ఉద్యోగ స్వీకరణకు వీలుగా ఆయన తన పార్లమెంటు సభ్యత్వానికి రాజీనామా యిస్తున్నారని తెలుస్తున్నది.

విదేశాలలో

విదేశాలలో మొత్తంమీద ఈ మాసం అంతటికీ ప్రపంచ దృష్టిని ఆకర్షించినది సూయజ్ కాలువ సమస్య. మధ్యప్రాచ్యంలోని ఈజిప్టు ప్రముఖస్థానం వహిస్తున్నది. నూరేళ్ళుగా బ్రిటిష్ వారు తమ సైన్యాలను అక్కడ అట్టేపెట్టి ప్రపంచ దేశాల వాణిజ్యానికి ముఖ్యమైన సూయజ్ కాలువను కంట్రోల్ చేస్తున్నారు. మధ్య ప్రాచ్యంలో పాశ్చాత్య రాజ్యాలకు అనేక ప్రయోజనాలున్నాయి. అక్కడి అరబ్ దేశాలలో పెట్రోలు గనులు అనంతంగా వున్నాయి. వీటికి పొరుగునవున్న యూదు రాజ్యం ఇజ్రాయల్‌కు సరిపడదు. ఇజ్రాయల్‌పట్ల పాశ్చాత్య రాజ్యాలకు— ముఖ్యంగా అమెరికాకు సాను

భూతి ఎక్కువ. అరబ్ రాజ్యాలలో పలుకుబడి సంపాదించుకోడానికి రష్యా యత్నించడం పాశ్చాత్యరాజ్యాలకు యిష్టంలేదు. కనకనే అవి బాగ్దాద్ రక్షణ సంధిని రూపొందించాయి. దానిలో ఈజిప్టు చేరలేదు. ఇరాకు తప్ప ఏరాజ్యం చేరలేదు. ఈజిప్టు తనకు పాశ్చాత్య రాజ్యాలు ఆయుధాలు అమ్మకపోతే చెకోస్లోవాకియానుంచి కొనుక్కొంది. దానితోనే చిచ్చు ముట్టింది. ఈజిప్టు నైల్‌నదిపై అశ్వాన్‌వద్ద ఆనకట్ట నిర్మాణానికి బ్రిటన్ అమెరికాల సహాయం కోరింది. ముందు చేస్తామనిచెప్పి తర్వాత చెయ్యమని రెండు దేశాలు అన్నాయి. దానితో ఈజిప్టు జులై మాసాంతంలో సూయజ్ కాలువను జాతీయం చేసింది పాశ్చాత్యరాజ్యాలకు పచ్చివెలక్కాయ గొంతుకలో అడ్డుపడ్డది. ఆగ్రహావేశాన్ని ఆపుకోలేక తమ సైన్యాలను, విమానాలను ఈజిప్టు మీదికి దూకించబోతామని బెదిరించాయి. ఈజిప్టు ప్రెసిడెంట్ కర్నల్ నాజర్ జంకలేదు. బెదరలేదు. దానితో బ్రిటన్ 22 దేశాలను పిలిచి లండన్‌లో సభ జరిపింది. ఆ సభలో చేసిన నిర్ణయాలతో అమెరికా, పాకిస్తాన్, టర్కీ, ఇరాక్, ఇండియా దేశాల ప్రతినిధులు కైరోకు వెళ్ళనున్నారని నేటి (ఆగస్టు 24) వార్త. ఇండియా కూడా ఈ చర్చలో పాల్గొని ఒక పథకాన్ని ప్రతిపాదించింది. ఇక పాశ్చాత్యరాజ్యాల సూచనలపై ఈజిప్టు ఏవిధంగా వ్యవహరించేదీ చూడవలసివుంది. ఈజిప్టు ఇంతవరకు ఇండియా పథకాన్నే సమర్థిస్తూవుంది.

---

## భీమా సంస్థలు

పై మువ్వురికి ఏనుగ ఆకారమును గురించి స్వల్పమే తెల్సింది. వీరికి ఏనుగాకారముగా చెక్కిన బొమ్మనుయిచ్చివుంటే వారు దానినంతను తమ వ్రేళ్ళతో స్పృశించి దాని ఆకారమేమిటో కొంత తెల్సుకొని వుందురు, అప్పటికీ ఏనుగ పరిణామమెంతో కనుగొనుటకు వారికి అవకాశముండి వుండదు.

అట్లే ఒకనికి భీమా సున్నని గోడవలె కనబడవచ్చును. ఇంకొకని భీమా చెట్టు బోదవలెతోచవచ్చు. మూడవవానికి భీమా మోకువలె గోచరించవచ్చును. కాని భీమా సంస్థను అభివృద్ధి పరచుటకు తనజీవితము నర్పించిన వానికి దాని ఆకారము స్పష్టముగా తెలుస్తుంది. భీమావలన జనసామాన్యమునకు జరుగు సేవయంతయు వాని కండ్ల ఎదుట స్పష్టముగా విశదమగును.

భీమా ప్రజోపయోగమైన సంస్థగనుక ఇది ప్రయివేటు సంస్థల ఆధిపత్యమున నుండుట కంటె ప్రభుత్వ పరముగా నుండుట శ్రేయోరాజ్య వ్యవస్థకు అనుగుణముగా నుండునని భీమా వ్యాపారము జాతీయము కావింప బడినది. ఇటుపైని వెలువడనున్న పత్రికలో యీ క్రింది విషయములను గురించి తెలుప బడును.

1. ఇండియనులు స్థాపించిన 149 భీమా కంపెనీలను విదేశీయులు స్థాపించిన 16 భీమా కంపెనీలను మనదేశ శ్రేయస్సు కోరిన మేధావియైన అర్థికమంత్రి శ్రీ సి. డి. దేశ్ ముఖ్ యెందుకు దేశీయము చేసిరో !

2. భీమాలను దేశీయము చేసి గవర్నమెంటు స్వాధీనము చేసుకొన్న వెంటనే భీమా దార్లకు కలిగిన లాభములు.

3. 1956 వ సం॥ సెప్టెంబరులో (భీమా జాతీయ సంఘము) నేషనల్ కార్పొరేషన్ స్థాపించిన వెంటనే భీమా దార్లకు రానున్న లాభములు ప్రయోజనములు.

---

# రంధ్రాన్వేషణము

'సుభాషిణి'

విశాలాక్షమ్మా, ఆమె కుమార్తె సుహాసినీ ఒకరోజున సూరమ్మ మామ్మగారింటికి వచ్చారు. విశాలాక్షమ్మ అందీ "సూరమ్మా మామ్మగారూ! మిమ్మల్ని ఒక సంగతి అడుగుతాను చెప్తారా?"

"అడుగమ్మా! తెలిసినంతవరకు చెప్తాను."

"అబ్బే, మరేంలేదు. మీ స్వంతవిషయం. మీ రేమన్నా అనుకుంటారేమోనని సందేహిస్తున్నాను."

"ఏమీ భయంలేదు. విధిగా అడుగు. తప్పకుండా చెప్తాను."

"ఎంత కాలంనుంచో అడుగుదా మనుకుంటాను. మీరు ఇవ్వాళ కొంచం తీరికగా ఉన్నారు కదా అని ఇప్పుడు ధైర్యం తెచ్చుకున్నాను."

సూరమ్మగారికి వయసు మళ్ళింది. దాదాపు అరవై సంవత్సరాలుంటాయి. అయినా అంత ముసలి ఆమెలా కనపడదు. భర్త ఎప్పుడో మరణించాడు. చెప్పుకోతగ్గ ఆస్తికూడా ఏమీ లేదు. ఇల్లుమాత్రం ఉంది. పరిశుభ్రంగా ఉంచుకుంటుంది. ఆమె కూడా పరిశుభ్రంగా ఉంటుంది. ఎప్పుడూ ఎవరో వచ్చి కూర్చుని ఆమెతో సంభాషించి వెళ్ళిపోతూ ఉంటారు. ఇరుగు పొరుగు స్త్రీలందరికీ ఈమె అంటే ఎంతో గౌరవం. పురుషులకి కూడా ఎంతో భక్తి ఈమె అంటే. ఏ బాధలూ, చిక్కులూ ఉన్నట్లు ఆమె ఎప్పుడూ కనపడదు. వచ్చిన వాళ్ళందరికీ ఏవో మంచి మాటలు చెపుతూ ఉంటుంది. ఆ పేటలోనే నివసిస్తున్న విశాలాక్షమ్మ ఆమెను అలా అడిగే సరికి ఆమె ముఖంలో ఏ సంకోచమూ కనపడలేదు.

"మీ వయసులో, మీకు ఉన్న చిక్కులతో మీరు ఎంతో సుఖంగా ఉన్నట్టు కనబడతారు. మిమ్మల్ని ఎరిగివున్న సమస్త ప్రజలూ మిమ్మల్ని ఎంతో గౌరవిస్తారు. మీ జీవితం ఎప్పుడూ ఆనందమయంగా ఉంటుంది. ఇందుకు కారణం ఏమిటి? మీ జీవిత రహస్యం నాకు తెలుసుకోవాలని ఎన్నాళ్ళ నుంచో కుతూహలంగా ఉంది. మీకు అభ్యంతరం లేకపోతే చెప్తారా?"

విశాలాక్షమ్మ కూతురు సుహాసిని "ఏమిటమ్మా ఉండి ఉండి అలాంటి ప్రశ్న వేస్తావు. మామ్మగారు మనసు కష్ట పెట్టుకుంటారు. చాలులే!" అన్నట్టు తల్లివేపు చూస్తూ కళ్ళతో సౌంజ్ఞ చేస్తూ తల్లి చీరకొంగు పట్టుకొని లాగింది.

ఇలాంటి ప్రశ్న వినడంతోనే సూరమ్మగారి ముఖం వికసించి నట్టయింది.

"విశాలాక్షీ! మంచి ప్రశ్న వేశావు. రా! ఇలా కూర్చో. సావధానంగా చెప్తాను. ఇలాగ ఎవరూ నన్ను ఎప్పుడూ అడగలేదు. ఏవో పురాణాలూ, నీతులూ, ధర్మాలూ చెప్పమనేవారేగాని నా జీవిత రహస్యం అడిగినవారు లేనేలేరు." అని చాపమీద ఇద్దరినీ కూర్చోపెట్టి ఇలా చెప్పడం ప్రారంభించింది.

"ఈ విషయంలో నేనంత ఎక్కువగా చెప్పవలసిన అవసరంలేదు. ఇతరుల తప్పులను ఎంచ

కుండా ఉంటే మనకుకలిగే శాంతి ప్రశాంతతలు యింకెవరికీ కలగవు. ఇతరులను అర్థం చేసుకో కుండా మనం నోరు జారవిడవకూడదు. పాపం! ఆయన చెప్పేవారు; 'ఇతరుల తప్పు లెన్నడూ యెంచకూడ'దని. ఎప్పుడయితే నేను అది పాటించానో అప్పటినుంచీ నాకు శాంతీ, సుఖం ఏర్పడ్డాయి.

"తప్పు లెన్నువారు తండోప తండంబు,
యుర్వీజనులకెల్ల నుండు తప్పు
తప్పు లెన్నువారు తమతప్పు లెరుగరు"

అన్నాడు యోగి వేమన. గురివెంద గింజ తన నల్లుపును కానలేక పోయినట్లు మానవులుకూడా తమలోని లోట్లను చూడలేరు. ఇతరుల తప్పు లను యిట్టే వెదకి పట్టేస్తాము. ఇది యెంత దుస్స్వభావం! ఎంత అవమానకరం! ఎప్పుడో ఒకప్పుడు మనం అందరం ఈ తప్పు చేసిన వాళ్ళమే. మనం కూడా యిందుకు గురి అయిన వాళ్ళమే. మా ఆయన చెప్పేవారు— క్రైస్తవ మత సిద్ధాంతాలలో ఒక నిబంధన అందరూ ఉల్లంఘిస్తారుట. "ప్రక్కవానిపై అపనింద వేయకు" అనేదాన్ని. ఇతరులను గురించి తేలి కగా మాట్లాడడంవల్ల వాళ్ళకి తీరని అపకారం కలుగుతుంది. మనం తీరని అపకారం చేస్తున్నా మన్నమాట.

ఒకప్పు డొకాయన మహమ్మదు పైగంబరు వారిని "ఒకానొక మిత్రునిపై అన్యాయముగ నింద మోపిన నేరం ఎలా బాపుకుంటాను" అని అడిగేడట. అందుకు వారు "ఈ గ్రామంలోని ప్రతి ఇంటి గుమ్మంముందూ ఒక దూది పింజను ఉంచి ఉదయాన్నే వాటి నన్నిటినీ పోగుజేసి తీసుకురా!" అన్నారట. రాత్రి గాలికి అవి ఎగిరి పోతాయి. మళ్ళీ ఎలా తీసుకురాగలడు? "నువ్వన్న నిందా వాక్యాలు కూడా అంతే. నీ మిత్రుని యెడల నువ్వు అంత తేలికగా మాట్లాడావన్నమాట" అని అన్నారు. మన పొరుగువాడు గట్టివాడైతే మనం పెంకివాళ్ళం అవుతాము. ఏమిటీ ఇద్దరికీ తేడా? మన తప్పు మన వద్ద ఉంచుకొని ఇతరులను వేలెత్తి చూపడం ఎందుకు? ఇతరుల తప్పులు ఎంచడం మనకి సహజం అయినప్పుడు, ఇతరులు కూడా మన లాగే మన తప్పులను ఇట్టే పట్టేస్తారని తెలుసుకోవాలి.

ఒక ఇల్లాలు తన స్నేహితుని కిటికీదగ్గరకి తీసుకెళ్ళి పక్క ఇంటివాళ్ళు వాళ్ళ గుడ్డలు ఎంత మురికిగా ఉంచుకుంటారో చూడండి అని చూపించిందట. కానివాస్తవంగాచూస్తేమురికిగా ఉన్నవి వాళ్ళ గుడ్డలు కాదు. తన కిటికీయే ధూళీ, బూజులూ కొట్టుకుంటూ ఉంది.

తప్పు చేసినవారు, తప్పు చేయడానికి ప్రేరే పించిన పరిస్థితులను నిష్పక్షపాతంగా అవగా హన చేసుకోలేకపోవడం వల్లనే నిర్దయ ఉత్ప న్నం అవుతూంది. అర్థం చేసుకుని జాలిపడడం వద్దూ! చైనా దేశీయులలో ఒక సామెత ఉంది. "నిన్ను ఇతరులు తప్పు అర్థం చేసుకన్నా రని విచారించకు. నువ్వు ఇతరులకు అర్థం కాకుండా ఉన్నావని విచారించు" అని. నిష్పక్ష పాతమైన దృష్టితో తరిచి చూడక పోవడం వల్లనే సాధారణంగా మనం ప్రతిరోజూ ఇతరు లకు నిర్దాక్షిణ్యంగా పేర్లు పెడతాం.

ఆదోషం చేసినవాని స్థానంలో, వాడు ఉన్న పరిస్థితుల్లో-నేనే ఉంటే అలాంటిది చేయనా అని ఆలోచించుకుంటే ఇంకొకళ్ళని అనవలసిన పనే ముంది. నేను చేసేదే మంచిది అనే అభిప్రాయం మంచిదా అమ్మా!

ఈ సందర్భంలో ఒక చిన్న కథ చెపుతాను. ఏసుక్రీస్తువారి హృదయవైశాల్యాన్ని గూర్చిం దది. ఒక సారి ఒక పెద్ద గుంపులో జనం ఒక స్త్రీని రాళ్ళు రువ్వి చంపుతున్న సమయంలో క్రీస్తు ఆదారిని వెళుతూ "ఆగండి. ఏమిటది?" అని అడిగాడట. వాళ్ళంతా "ఈ మనిషి పాపి. అతి నీచమైన పాపకార్యాలు చేస్తూంది. ఇది సంఘానికి అనర్థకం తీసుకొస్తూంది. దీన్ని చంపు తున్నాం" అన్నారట.

"ఓ! భేషుగ్గా ఉంది. కొట్టవలసిందే తప్ప కుండాను. కాని మీలో ఏ ఒక్క పాపమూ ఎన్నడూ చెయ్యని వాళ్ళు మాత్రమే కొట్టాలి" అన్నాడటాయన. తప్పు చెయ్యని వాడెవడు? ఒకరి మొఖం ఒకళ్ళు చూచుకుని వాళ్ళంతా పశ్చాత్తాపపడి రాళ్ళు క్రింద పారేసి అతని కాళ్ళమీద పడ్డారట. ఆమె తరవాత మహా భక్తురాలయింది.

నేను చెప్పబోయే దేమిటంటే, అందరమూ తప్పులు చేస్తాం. ఇతరులు నిన్ను ఎలా చూడా లని కోరతావో నువ్వూ ఇతరులని అలానే చూడాలి కదా! విశాల భావంతో చూడాలి కదా! భారతంలో ఒక పద్యం ఉంది.

**ఒరులేయవి యొనరించిన**
**నరవర అప్రియము తనమనమునకగు దా**
**నొరులకవి సేయకునికియె**
**పరాయణము పరమధర్మ పథములకెల్లన్.**

అందరిలోనూ మంచీ ఉంటుంది. చెడూ ఉంటుంది. మనం చెడ్డనే ఎందుకు చూడాలి? మంచినే గ్రహించేశక్తిని అలవాటుచేసుకోవాలి. ఒక గురువుగారు తెల్లని కాగితంమీద సిరాతో ఒక చిన్న సున్న గీసి గోడకి తగిలించి శిష్యుల్ని మీకు ఏమి కనపడుతూంది అని అడిగాడట. నల్లని సిరా మరక కనపడుతోందని అందరూ అన్నారట. "కాని దాన్ని ఆవరించుకుని ఉన్న తెల్లని తెలుపు మీకు కనపడడంలేదా? నలుపు మాత్రమే మీకు కనపడుతోందా? తెలుపును చూడడం నేర్చుకోండి"అని ఆయన చెప్పారట!

నువ్వేదో అడిగితే నేనేదో చెప్పేస్తున్నాను. పాపం ఆలస్యం అయిపోయింది. ఇంతకీ సారాంశం ఏమిటంటే నీహృదయం విశాలంగా, నిర్మలంగా ఉంచుకుంటే సమస్తమూ నీకు ఆనందంగా గోచరిస్తుంది. నిన్ను అందరూ తిరిగి ప్రేమిస్తారు. మీ అందరికీ నా మీద ఎంతో ప్రేమ. అదే నా కానందం. నాకిం కేంకావాలి."

"మా స్కూల్లో మా మేష్టారు కూడా ఇలా చెప్పరు. మనసు కెక్కేలాగు మామ్మ గారు ఎంతబాగా చెప్పారో" అన్నది సుహాసిని వెళ్ళిపోతూ అమ్మతో.

విశాలాక్షమ్మ కళ్ళు తుడుచుకుంటూ "చెప్పడం కాదమ్మా! తన భావాలను ఆచర ణలో పెట్టిందిగనుక నే అంత గొప్పదయిందామె. ఎప్పుడూ ఆనందంగా ఉంటుంది. ఇతరుల తప్పు లెంచకపోవడం, సహృదయంతో ఇతరుల కష్టాలను అర్థం చేసుకోవడంవల్లనే ఆమె ఆనందం పొందుతూ ఉంటుంది" అంటూ ఇంటికి వెళ్ళిపోయారు తల్లీ కూతుళ్లిద్దరూ.

---

# కొలతలు, తూనికలు - దశాంశ పద్ధతి ప్రాశస్త్యం

శ్రీ పీతాంబర్ పంత్

(నాణాలలో దశాంశ పద్ధతిని ప్రవేశ పెట్టడంతోపాటు కొలతలు తూనికల విషయంలోకూడా యీ పద్ధతి ప్రవేశ పెట్టినప్పుడే దీని పూర్తి ప్రయోజనాలను మనం పొందగల్గుతామని, ప్లానింగు కమిషన్‌కు సంబంధించిన శ్రీ పీతాంబర్ పంత్ ఇందులో వివరించారు.)

కొద్ది సంవత్సరాల కిందట బెంగాలులోని గ్రామ సీమలలో దూరాన్ని "కిళ్ళీ"ల లెక్కన కొల్చేవారు. అంటే, ఒక కిళ్ళీ తినే లోపల ఎంత దూరం నడవడానికి వీలవుతుందో ఆ దూరం కిళ్ళీ దూరం అని నిర్వచనం! కిళ్ళీకి దూరానికి ఉండే సంబంధం పైవారికైతే అంత సులభంగా బోధపడదుగాని బెంగాలు గ్రామీణులను అడిగితే అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు దీని అర్థాన్ని మనకు విప్పిచెపుతారు. కాబట్టి ఎంత ఎక్కువ దూరం నడిస్తే అన్ని బీడాలు ఖర్చు అవుతాయి. ఈ విధంగా బీడా అనేది దూరాన్ని కొలిచే ఒక పరిమాణంగా పరిణమించింది. ఇంత చెప్పినమీదట బీడాకీ దూరానికి ఉండే సంబంధం ఏమిటో లీలగా అర్థమైనట్లుండవచ్చును గాని ఆ పరిమాణం యొక్క ప్రామాణికత విషయంలో మాత్రం మనకు కలిగిన సందేహాలు యథాప్రకారంగానే నిలిచి ఉంటాయి.

కిళ్ళీల లెక్కన దూరాన్ని కొలవడం అనే ఆలోచనే మనకు నచ్చదు. అది విచిత్రపద్ధతే కాకుండా హేతు విరుద్ధమైన పద్ధతి అనిపిస్తుంది. కాని చుట్టూ పరికించి చూచినట్లయితే చిరకాలం మనం యిటు వంటి అయోమయావస్థలోనే దిగబడిపోయి ఉన్నామనీ, యీ విషయం యింతకాలం మనం ఆలోచించకుండా అంటీముట్టనట్టుగా ఉంటూవచ్చామనీ స్పష్టమౌతుంది. భారతదేశంలో అనేక ప్రాంతాలలో తులామానాలు కొలమానాలు నేటికీ ఇట్టి ఆదిమ స్థితిలోనే ఉన్నాయి.

రాళ్ళూ రప్పలూ కొయ్యముక్కలూ తులామానాల కింద, చిత్ర విచిత్రమైన ఆకారాలు గల ఎన్నో రకాల మట్టి పాత్రలూ, బుట్టలూ కొలమానాలకింద తరుచు ఉపయోగించడం మనం చూస్తూనే ఉన్నాం. ఇప్పటికీ గుడ్డను మూరలూ, బెత్తలూ, బొటనవేళ్ళ లెక్కన కొలుస్తూ ఉండడం పరిపాటే. రాష్ట్ర ప్రభుత్వాలూ స్థానిక సంస్థలూ యీ వైవిధ్యాన్ని కొంత అదుపులో పెట్టడానికి కృషిచేస్తూనే ఉన్నాయిగాని యీ తేడాలు యింకా అలాగే ఉన్నాయి. కొలతలూ, తూనికలూ, జిల్లా కొక తీరుగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఒకే పట్టణంలో ఒక పేటలో ఒక రకంగానూ మరో పేటలో మరో రకంగానూ ఉండడంకూడా కద్దు. ఈ పరిమాణాలకు వేర్వేరు ప్రాంతాలలో వేర్వేరు అర్థాలు ఉంటూ ఉంటాయి. ఉదాహరణకు మణుగు ఉందంటే, ప్రాంతాన్నిబట్టి అది 280 తులాలనుంచి 8300 తులాలవరకు ఎంతైనా కావచ్చు. 100 రకాల మణుగులు దేశంలో చలామణీలో ఉన్నట్లు తెలుస్తుంది. ఇలాగే ప్రామాణికమైన శేరుకు 80 తులాలు అని అర్థం అయితే, 8 తులాలనుంచి 160 తులాలవరకు ఉండే అనేక రకాల శేర్లు చలామణిలో ఉన్నాయి. ఉత్తరాదిలో వాడుకలో ఉన్న తూనికల పేర్లు దక్షిణాదివారికి అపరిచితాలు, ఇలాగే దక్షిణాది పేర్లు ఉత్తరాదివారికీనూ. ఈ అన్ని రకాల తూనికలను అవసరం వచ్చినప్పుడు వాడుకోవడం అలా ఉండగా, కనీసం వాటి పేర్లు కంఠతః పట్టడం కూడా సాధ్యం కాదేమో అనిపిస్తుంది.

దైర్ఘ్యం, విస్తీర్ణం, ఘనపరిమాణం వీటికి సంబంధించిన కొలతల విషయమూ అంతే. ఇట్టి పరిస్థితిలో యీ కొలమాన, తులామానాలను వెంటనే సంస్కరించడం అనివార్యం అనిపిస్తుంది. కాని యీ వేర్వేరు రకాల కొలతలు తూనికలూ చలామణీలో ఉంటే మాత్రం, నష్టమేమిటి? అన్నిటినీ ఒక రకంగా సంస్కరిస్తే మార్పు అనేది లేకుండా, విసుగెత్తదా? అని ఎవరైనా ప్రశ్నించవచ్చును. అదీగాక సారూప్యాన్ని మనం వైవిధ్యంలోనే సందర్శించ గోరుతున్నామాయె:

ఇంతకాలం యీ విషయం పట్టించుకోకపోయినా, రోజులు హాయిగానే వెళ్ళిపోయాయి: ఎన్నో ముఖ్యమైన సంస్కరణలు మనం ముందుగా ఆచరణలో పెట్టవలసినవి ఉండగా, దీని విషయమే అంత పట్టుదల ఎందుకు? అల్ప విషయాలగురించి వృథాశ్రమ దేనికి? అని ఎవరైనా ప్రశ్నించవచ్చును.

కొత్తగా తెచ్చే మార్పులను సంశయ దృష్టితో పరికించడం పరిణతికి లక్షణం కానీ యీ సంశయం కొత్త భావలన్నిటికీ — అవి ఎట్టివైనా సరే - అడ్డుగోడగా పరిణమించడం హానికరం. ఈ సంశయం అనేది మన జిజ్ఞాసను మరింత తీవ్రతరం చేయాలి. కాబట్టి మనం ఏ పరిస్థితుల్లో ఉన్నదీ ఒకసారి నాలుగు మూలలకూ దృష్టి సారించి తెలుసుకోవడం అవసరం.

## ప్రస్తుత పద్ధతి : దాని లోపాలు

ఇన్ని రకాల కొలతలూ తూనికలవల్ల ఎక్కువగా నష్టపోయేది రైతు. రైతాంగాన్ని కెక్కరించడానికి వ్యాపారస్థులు దీనిని ఒక చక్కని సాధనంగా ఉపయోగించుకుంటున్నారు. ప్రతి వ్యాపారస్తుడూ తన ప్రాంతంలో చలామణీలో ఉన్న తూనికల లెక్కన ఫలసాయానికి ధరలు చెప్పడంతో రైతుకు ఎవరు ఎక్కువ గిట్టుబాటైన ధర చెబుతున్నారో కూడా తెలియని క్లిష్టసమస్య ఏర్పడుతుంది. రైతు వ్యాపారస్థుడి మీదా, వ్యాపారస్థుడికి రైతుమీదా పరస్పరం అనుమానాలు ఏర్పడతాయి. వీటి అన్నిటివల్ల చివరికి రైతే నష్టపోవలసివస్తుంది. ఇవన్నీ ఇలా ఉండగా వీటికి తోడు దొంగ తూనికలు దొంగ లెక్కల బెడద మరొకటి ఉంది. ఇట్టి పరిస్థితిలో అందరికీ తేలిగ్గా అర్థమయే సర్వ ప్రాంతాలకు వర్తించే తూనికలూ కొలతల పద్ధతిని ప్రవేశపెట్టడం రైతాంగానికి ఎంత లాభకరమో వేరే చెప్పనవసరంలేదు.

వ్యాపారస్థులకూ కమిషన్ ఏజెంట్లకూ, దళారులకూ విక్రేతలను వంచించడానికి ప్రస్తుత పరిస్థితిలో అపారమైన అవకాశాలు ఉండడంవల్ల వారి సంస్కరణల విషయంలో ఉదాసీనత ప్రదర్శించడం సహజం. కాని అంతిమంగా ఋజుత్వం, ప్రామాణికత తమకే లాభం అనే విషయం వారు గ్రహించాలి. ముఖ్యంగా వస్తు వినిమయం చేసుకోవడమే వ్యాపారం గనుక దీనికి సులభగ్రాహ్యమైన సరళ పద్ధతి ఏదైనా ఉంటే అది వ్యాపారానికి దోహదం చేస్తుంది. ప్రస్తుతం కొలతలు, తూనికలకు క్రమబద్ధమైన పద్ధతి లేకపోవడంవల్ల వ్యాపారాభివృద్ధికి ఎంత ఆటంక మేర్పడుతున్నది అనేక మందికి తెలియదు.

మన బడి పిల్లలు పడే అవస్థలుకూడా యీ సందర్భంలో గమనించడం ఉచితం. యీ ఉదయం నేను గణిత పుస్తకం ఒకటి తెరిచి చూసేసరికి, దాంట్లో మూడు పేజీల నిండా దేశంలో ముఖ్యంగా వాడుకలో ఉన్న వివిధ రకాల తూనికలూ కొలతల పట్టికలు కన్పించాయి. ఈ పట్టికలన్నీ క్షుణ్ణంగా భట్టీయం వేసినప్పుడే విద్యార్థి తూనికలు కొలతలకు సంబంధించిన లెక్కలను సరిగా చేయగలుగుతాడని గ్రంథకర్త ఒకచోట హెచ్చరికచేశారు. ఇన్ని రకాల పొంతనలేని మానాలను బట్టీ కట్టలేక బడిపిల్లలు విసుగెత్తిపోతారు. దానితో వారికి బడికి వెళ్ళడం అంటేనే భయం పుట్టుకొస్తుంది.

కాబట్టి ఏ దృక్పథంనుంచి చూచినా, క్రమబద్ధమైన తులామానాలను కొలమానాలను త్వరలో ప్రవేశపెట్టడం అగత్యం.

## దశాంశ పద్ధతివల్ల లాభాలు

అయితే యీ సమస్య మన దేశానికి మాత్రమే సంబంధించిందని భావించడం పొరపాటు. అనేక దేశాలలో ప్రభుత్వం సంస్కరణలు ప్రవేశపెట్టక పూర్వం స్థితిగతులు యింత అయోమయంగానూ అధ్వాన్నంగానూ ఉండేవి. విజ్ఞానం పెంపొందడంవల్లనేమి, అంతర్జాతీయంగా, రాకపోకలూ వ్యాపారమూ పెరగడంవల్లనేమి, ఆమూలంగా యీ మానాలలో మార్పులు తీసుకురావలసిన అగత్యం రాజకీయవేత్తలకు బాగా తెలిసివచ్చింది. తత్ఫలితంగా ౧౦౦ ఏళ్ళకిందట ఫ్రాన్సులో దశాంశపద్ధతి ప్రవేశ పెట్టబడింది.

దశాంశ పద్ధతిని వారు "సర్వ ప్రపంచ ప్రజానీకానికి, సర్వకాలీన ప్రజకూ" అంకితం చేశారంటే, ఆ పద్ధతిని ప్రవేశపెట్టడంలో వారిలక్ష్యం ఏమిటో స్పష్టమౌతుంది. నిజానికి యీ పద్ధతి ఎంత క్రమబద్ధమైందీ, సులభమైందంటే, ప్రపంచ జనాభాలో అయిదింట నాల్గువంతులు దానినిప్పుడు అవలంబించారు.

ఈ అంతర్జాతీయ పద్ధతిని అనుసరించడానికి మన ప్రభుత్వం ఇటీవలచేసిన నిర్ణయాన్ని పార్లమెంటు అప్పుడే ఆమోదించడమే కాక, ప్రజలూ పత్రికలవారూ కూడా తమ హర్షం తెలియజేశారు. వాస్తవంగా ఇది అత్యంత ప్రధానమైన సంఘటన.

## దశాంశ పద్ధతి

అయితే కొలతలూ తూనికలలో దశాంశ పద్ధతి అంటే ఏమిటి? ప్రస్తుతం కొలమానాలలోను తులామానాలలోను ఉన్న అనంతమైన వైవిధ్యాన్ని తొలగించి, దశాంశ పద్ధతిలో వీలైనంత తక్కువ సంఖ్యగ ప్రమాణాలను రూపొందించడమే యీ పద్ధతియొక్క ఉద్దేశ్యం. యీ పద్ధతి ప్రకారం దైర్ఘ్యం కొలమానాలంటే దానికి ప్రమాణం మీటరు. ఫ్రాన్సులో సెవర్స్‌లోని అంతర్జాతీయ మెట్రిక్ కమిషన్ పురావస్తు నిలయంలో, ప్లాటినమ్, ఇరిడియమ్‌లతో చేసిన ఒక కడ్డీ ఉంది, ఆ కడ్డీమీద రెండు గీతలు గీసిఉంటాయి. రెండు గీతలకు మధ్య ఉన్న దూరాన్ని మీటరు అని అంటారు. ఇది ప్రమాణంగా పెట్టుకొని దశాంశంతో దీనిని హెచ్చించుకుంటూపోతే లేదా విభాగించుకుంటూపోతే, మనకు కావలసిన దైర్ఘ్య పరిమాణాలన్నీ లభిస్తాయి. ఇతర కొలమానాలు తులామానాల విషయంలోకూడా ఇదే పద్ధతి అవలంబించబడుతుంది.

దశాంశ పద్ధతిలో 'డెకా' అంటే ౧౦ రెట్లు. 'హెక్టో' అంటే వంద రెట్లు, 'కిలో' అంటే వెయ్యి రెట్లు అని అర్థం. ఇలాగే డెసి అంటే పదో వంతు 'సెంటీ' అంటే వందో వంతు, 'మిల్లీ' అంటే వెయ్యో వంతు అని అర్థం. దైర్ఘ్యానికి 'మీటరు' ప్రమాణం అయితే, తూనికలు 'గ్రామ్' ఘనపరిమాణానికి లీటరు ప్రమాణాలు.

పై జెప్పిన డెకా, డెసి, హెక్టో, సెంటీ వంటి ఉపసర్గను యీ ప్రమాణాలకు తగిలించినట్లయితే మనకు కావలసిన వివిధ రకాల పరిమాణాలు లభిస్తాయి. ఈ దశాంశ పద్ధతిలో 3 రకాల ప్రాతిపదిక ప్రమాణాలకూ అన్యోన్య సంబంధం ఉండడమనేది ముఖ్యంగా గమనించవగిన విశేషం. ఒక మీటరులో శతాంశం ఘనపరిమాణంగల నీటి బరువును గ్రాము అని నిర్వచించారు. కాని గ్రాము చాలా చిన్నది అవటంచేత కిలో గ్రామును సామాన్యంగా వాడుతూ ఉంటాము. ఒక కిలోగ్రాము బరువుగల జలం యొక్క ఘనపరిమాణం పేరే 'లీటరు'.

తెలివి గల పిల్లలు మూడు, నాలుగు పాఠాలతో యీ దశాంశ పద్ధతిని తేలిగ్గా అర్థం చేసుకోగలుగుతారు; పెద్దవాళ్ళకయితే ఇది తెలుసుకోడానికి ఒక గంట పడుతుంది.

ఇది దశాంశ పద్ధతి కావడంవల్ల ఇందులో భాగహారాలూ, గుణకారాలూ క్లిష్టమైనవి ఉండవు; సామాన్యంగా యీ పద్ధతిలో లెక్కలుచేయడం అంటే దశాంశ సంకేతాన్ని యిటూ అటూ మారుస్తూ ఉండడమే తప్ప ఎక్కువ కష్టం ఏమీఉండదు. ఈ పద్ధతి అవలంబించినట్లయితే, భిన్నాలలోను, వినిమయ ప్రక్రియలలోను అవస్థపడవలసిన అవసరం ఉండదు; విద్యార్థుల అభ్యసన కాలంలో తేలిగ్గా నూటికి 20 వంతుల కాలాన్ని వ్యర్థం కాకుండా నివారించి, దానిని ఇతర ప్రయోజనాల కోసం సద్వినియోగ పరచవచ్చును.

## సుబోధకమైన ప్రమాణాలు

దశాంశ పద్ధతి ప్రస్తుతం అమలులో లేకపోయినా, ఇందుకు సంబంధించిన ప్రమాణాలు మనకు పూర్తిగా కొత్తకావు. మీటరు గేజి రైలు మార్గం అనే పదం ద్వారా మనకు 'మీటరు' అనే ప్రమాణం పరిచితమైంది. 'మీటరు' గజంకంటే $\frac{1}{10}$ వంతు అధికం. ఇట్లాగే ఆకాశవాణి కేంద్రాలు ప్రసారంచేసే రేడియో తరంగాల పరిమాణం మీటర్లలోను, కిలో సైకిళ్ళలోను ప్రకటించబడుతూ ఉంటుంది. విద్యుచ్ఛక్తిని వాడకం దార్లకు కిలోవాట్ గంటల లెక్కన అమ్ముతారు. సెంటిమీటరు, మిల్లిమీటరు అనేవి ప్రతి విద్యార్థికీకూడా సుపరిచితమైన మాటే. స్కేలుమీద అంగుళాలతోపాటు సెంటిమీటర్లు, మిల్లిమీటర్లుకూడా వ్రాసిఉంటాయి. ఇంక దూరాలను కొలవడానికి కిలోమీటరు అనే కొలత ఉంది, ఆ కిలో మీటర్లు రమారమి 5 మైళ్ళతో సమానం. ప్రతి అయిదవ ఫర్లాంగు రాయిమీద కిలోమీటరు గుర్తు వెయ్యాలని అప్పుడే ఒక ప్రతిపాదన చేయబడింది. నిజానికి ఇట్లా చేస్తే, లెక్కలో ఎక్కువ తేడా ఏమీ ఉండదుకూడా.

పోతే విస్తీర్ణం సంగతి. దశాంశ పద్ధతిలో చదరపు మీటర్లు లెక్కన వైశాల్యం గుణించబడుతుంది. చదరపు మీటరుకు స్క్వేరు మీటరు లేదా వర్గమీటరు అని పేరు.

100 చదరపు మీటర్లను ఒక 'ఏర్' అంటారు. 100 ఏర్లు ఒక హెక్టేరు అవుతుంది. ఇది సుమారు $2\frac{1}{2}$ ఎకరాలు ఉంటుంది. పొలాల కొలతలకు ఇదే కొలమానం అవుతుంది. ఇక తూనికకు ఉపయోగించే ప్రమాణం గ్రాము. మందులు తూచి యివ్వడంలో గ్రాములు ఉపయోగిస్తారు. మందులు వాడనివారితో సహా సామాన్య ప్రజానీకానికి అందరికీ యీ మాటలు తెలిసిననే. గ్రాము తులంలో 12 వ వంతుకంటే కొంచెం ఎక్కువ. వెలగల రాళ్ళను, రవ్వలను, నగదును, ఔషధాలను తూచడానికి యీ చిన్న చిన్న ప్రమాణాలు ఎంతైనా ఉపయోగిస్తాయి. ఇక సేరు స్థానే కిలోగ్రామును ఉపయోగించవచ్చును. ఇది ప్రామాణికమైన సేరుకంటే $\frac{7}{100}$ అధికం. పోతే ఘనపరిమాణాలు కొలతలకు లీటరు ఉపయోగించబడుతుంది. లీటరు పాలు సేరు పాలకంటే కొంచెం ఎక్కువ ఉంటాయి. గాలను అనే కొలమానం చలామణీలోంచి అంతర్ధానమౌతుంది. చిన్న కార్ల వర్తకులు ఇప్పటివరె తమ కారు గాలనుకు 45 మైళ్ళు నడుస్తుందని ప్రకటించడం బదులు, లీటరుకు 10 మైళ్ళు లేదా 16 కిలోమీటర్లు నడుస్తుందని ప్రకటించడం ప్రారంభిస్తారు. ఇదే దశాంశ పద్ధతి సారసంగ్రహమని చెప్పవచ్చును.

ప్రస్తుతం వైజ్ఞానికులు ఇదే విధానాన్ని అవలంబిస్తున్నారు. సంఖ్యాశాస్త్ర వేత్తలకు అక్కౌంటెంట్లకు ఇది ఒక వరప్రసాదంగా పరిణమించగలదు. జాతీయైక్యతను దృఢపరచడానికికూడా యీ నూతన విధానం దోహదకారి అవుతుంది.

దేశం యొక్క వైజ్ఞానిక పారిశ్రామికాభివృద్ధి సాధన నిమిత్తం యీ సంస్కరణను వెంటనే ప్రవేశపెట్టడం అవసరము.

## అంచెలవారీ కార్యక్రమం

ఈ దశాంశ పద్ధతి సుమారు 10 ఏళ్ళలో సర్వతోముఖంగా ప్రవేశపెట్టబడుతుంది. అంటే ఉత్పత్తి, వాణిజ్య వ్యాపారాలు, విద్య, సాంఘిక సంబంధాలు మొదలైన అన్ని రంగాలలో యీ నూతన విధానం అవలంబించబడుతుంది. ఇతర విధానాలు రద్దు అయిపోతాయి. ఈ సంస్కరణను ప్రవేశపెట్టడానికి 10 ఏళ్ళ కాలం చాలా ఎక్కువ అనిపించవచ్చును. కాని ఆలోచించి చూస్తే, యీ పరిణామం ఎంతో క్లిష్టమైందని బోధపడుతుంది. ముందు యీ సంస్కరణను ప్రజాదరణం పొందేట్టు చేయవలసి ఉంటుంది. తూనికలకు కోటానుకోట్ల కొత్త రకం రాళ్ళనూ, కొలతలకు కొత్త రకం స్కేళ్ళను, ఇతర కొలమానాలనూ తయారు చేయవలసి ఉంటుంది; ఇందుకు సంబంధించిన వివిధ వ్యవహారాలను చూడడానికి పరిపాలనా వ్యవస్థను ఏర్పాటు చేయవలసి ఉంటుంది; పోతే వివిధ రంగాలలో తీసుకొనే చర్యలను సమన్వయ పరచవలసి ఉంటుంది. కేంద్రంలోని దశాంశ మానస్థాయీ సంఘం, రాష్ట్రాలలోని సంఘాలూ, వివిధ కేంద్ర ప్రభుత్వ శాఖలలోని దశాంశ మానసంఘాలూ, యీ సంస్కరణలను సర్వతోముఖంగా ఎలా ఎన్ని అంచెలమీద ప్రవేశపెట్టాలో చర్చించి, ఒక సమగ్రమైన అంచెలవారీ కార్యక్రమాన్ని తయారు చేస్తున్నాయి.

నడిమి కాలంలో కొత్తగా ప్రారంభించే యంత్రాగారాలు మొదలైనవి దశాంశ పద్ధతి అవలంబించాలని నిర్ణయించబడింది. కొలమానాలకు, తులామానాలకు నూతన ప్రమాణాలను సవివరంగా నిర్ణయించే బిల్లు ఒకటి రూపొందించబడింది. ఇది జరుగుతున్న సంవత్సరంలోనే పార్లమెంటులో ప్రవేశపెట్టబడుతుంది. ఈ సంస్కరణను సూత్రప్రాయంగా పార్లమెంటు ఇదివరకే ఆమోదించి ఉందిగనుక, యీ బిల్లు త్వరలోనే చట్టమౌతుందని ఆశించవచ్చును. భారతీయ ప్రమాణ నిర్ణయ సంస్థవారు కొత్త రకాల కొలమానాలకు, తులామానాలకు డిజైన్లు అక్టోబరులోగా తయారుచేస్తారు. ఆ వెంటనే వాటిని పెద్ద ఎత్తున ఉత్పత్తిచేయడం ప్రారంభమౌతుంది. గణిత బోధన పద్ధతులను సంస్కరించడం, దశాంశ పద్ధతిని ప్రచారంచేసి ప్రజాదరణ పొందేట్టు చేయడంకూడా ముఖ్య కర్తవ్యాలుగానే పరిగణించబడుతున్నాయి. వచ్చే ఏడు ఏప్రిల్ 1 నుంచి దశాంశ పద్ధతి నాణాలను ప్రవేశపెట్టడంతో, కొలతలు, తూనికల విషయంలోకూడా దశాంశ పద్ధతిని త్వరలో ప్రవేశపెట్టడానికి మార్గమేర్పడుతుంది. నిజానికి యీ కొత్త పద్ధతి సంపూర్ణ ప్రయోజనాలను మనం సమగ్రంగా యీ సంస్కరణను ప్రవేశపెట్టినప్పుడే అనుభవించగల్గుతాము.

ఈ సంస్కరణ దేశంలోని సర్వ ప్రజలకు సంబంధించిన సర్వతోముఖ స్పర్శి అయిన సంస్కరణ. దీనిని జయప్రదంగా నిర్వహించాలంటే, అందుకు మన అందరి సహకారం అవసరం. ఈ కొత్త పద్ధతిని నేర్చుకొని ఆచరణలో పెట్టడం బహు సులభం. ఎవరికి వారు దీర్ఘకాలమజ్జాగతమైన జడిమను తమకైతాము పరిత్యజించి సర్వతా సారళ్యతలకు ప్రత్యేకమైన యీ సంస్కరణకు హృదయపూర్వకంగా స్వాగతమివ్వాలి.

# తిరుమలేశ?

శ్రీ పపలవాడ కోటినరసింహము

మొదలులేని తీఁగ పూయదు, కాయదు
పుట్టి గిట్టు; దాని గుట్టు దెలియు
దిట్ట నేఁటివఱకు నెట్టిఁడో తెలియదు
దీని భావమేమి? తిరుమలేశ!

పదచయమ్ము కంటఁ బడకుండు నెవనికి
శ్రవణ యుగము గోచరమ్ము గాదు
వక్ర గమన, దాని పగ వగఁ గలిగించు
దీని భావమేమి? తిరుమలేశ!

ఆఁడు బిడ్డలున్న అయ్యలిద్ద ఱొకప్డు
ఒకరి కొకరు బిడ్డ నొసఁగినారు
ఈఁడు గాని జోడు నాఁడు నేఁ డొనఁగూడు
దీని భావమేమి? తిరుమలేశ!

ఇతర గృహము నాక్రమించిన యఘమున
మందసమున నొదిఁగి కుందవలసె
పాప మంచు దాని వదలింపఁ డెవఁడేని
దీని భావమేమి? తిరుమలేశ!

తండ్రి - కొడుకు లొక్క తరుణీమణిం గూడ
పుత్రక ద్వయమ్ము పుట్టె నపుడు
అన్న - దమ్ము లాగ్రహమ్మున మెలఁగిరి
దీని భావమేమి? తిరుమలేశ!

వేసినపుడు గాని, తీసినపుడు గాని
చప్పుడింతయైన నొప్పనట్టి
తలుపు మూయ లోక ధర్మమ్ము శూన్యమ్ము
దీని భావమేమి? తిరుమలేశ!

అవయవమ్ము లన్ని యలరారుచుండును
గ్రామ - నామములను గలిగియుండు
ప్రాయమందు నెపుడు పరివర్తనము లేదు
దీని భావమేమి? తిరుమలేశ!

బలము గలిగి యెంతవఱకైనఁ బయనించుఁ
బగలు, రేయి కంటఁ బడకయుండు
దాని వీడు నతఁడు ధరణిలే డొక్కఁడు
దీని భావమేమి? తిరుమలేశ!

శాంత్యహింస లతని శస్త్రమ్ములగుచుండు
సత్యవచనమతని సహచరుండు
భరత ఖండ దాస్యబంధ విముక్తుండు
దీని భావమేమి? తిరుమలేశ!

ఒరుల కింత యొసఁగ నోపిన వాఁ డయ్యుఁ
బ్రతుకు రోసెనకట! మెతుకు మానె
ఆంధ్రు లంద ఱతని కంజలి యర్పింత్రు
దీని భావమేమి? తిరుమలేశ!

---

జవాబులు:- 1. చెట్టుపొందు పాఁచి తీఁగ, 2. సర్పము, 3. సముద్రుఁడు-విష్ణుఁడు, 4. పాము, 5. తండ్రి-కొడుకులు. 6. కనురెప్పలు, 7. ఛాయాపటము, లేక ఫొటో, 8. గాలి, 9. గాంధి, 10. పొట్టి శ్రీరాములు.

# "టీ పార్టీ" ★

శ్రీ సోమంచి రామం

"అమ్మా! డాక్టరుగారింట్లో టీపార్టీకి నేకూడ వెళ్ళొద్దుటే" అంటూ స్కూలునుంచి పరుగెత్తుకునివచ్చి పైనబడ్డ పదేళ్ళ గోపీకి ఏం సమాధానం చెప్పాలో తెలియక తబ్బిబ్బైంది ఆ తల్లి. తన భర్త పనిచేసే కంపెనీలో ఆఫీసర్లు టీపార్టీ చేసుకొంటారని మాత్రం ఆమెకు తెలుసు!— అదేనా తన భర్త చెప్పబట్టి! అలాటి ఆఫీసర్లు చేసికొనే టీపార్టీకి పదేళ్ళ గోపీ, అందులోనూ తనలాటి బీదదాని కడుపున పుట్టిన దురదృష్టపు గోపీ వెడతానంటే ఆ తల్లికి అయోమయంగా తయారయిందంతా! టీపార్టీ అంటే ఏవేవో మంచి మంచి విలువైన తినుబండారాలు తింటారని అప్పుడప్పుడు తన భర్త చెప్పేవాడు. అలా చెప్తుంటే తమ కాభాగ్యం లేక పోయిందే అని విచారించేది. అలాంటిదిప్పుడు తన కొడుకు టీపార్టీకి వెడతానంటే ఎలా పంపడమో సమస్యగ పరిణమించిందామాతృహృదయానికి.

"ఏమ్మే! అమ్మా! మాట్లాడవేమే!"- అంటూ తిరిగి గోపీ ప్రశ్నించగానే "అలాగేలే నాయనా! అలాగే వెడుదువుగానిలే!" అంది అప్రయత్నంగా! అన్నదేకాని ఎలా పంపడమో, ఎక్కడికి పంపడమో, అసలు ఎక్కడ టీపార్టీయో ఎందుకు టీపార్టీయో ఇవన్నీ తెలియవాతల్లికి.

"గోపీ!" అని పిలిచిందామె! ఆనందంతో పరుగిడుతున్న గోపీ అలా ఆగిపోయాడు. "ఇలా రా! నాయనా! అసలు టీపార్టీ యెక్కడమ్మా!" అని ఎంతో ప్రేమతో ప్రశ్నించింది. తల్లి తనపక్షమేనని గ్రహించిన ఆ పసి హృదయానికి ఉబలాట మెక్కువయింది. "కాలవదగ్గర డాక్టరుగారింట్లోనమ్మా! వాళ్ళబ్బాయి మురళీ నేను ఒకటే క్లాసు. మురళి పుట్టినరోజమ్మా — మురళి నన్ను మరీ మరీ రమ్మని చెప్పాడు. మురళికి నేనంటే ఎంతో యిష్టమమ్మా!" అంటూ గుక్క తిరక్కుండా చెప్పేస్తున్నాడు.

"డాక్టరుగారింటికా! వద్దు నాయనా! వద్దు" అందామె! "ఎందుకొద్దమ్మా?" అన్నాడేడుస్తూ గోపీ! అతని ఆనందమంతా వద్దు అన్న యీ ఒక్క మాటతో నాశనమయింది. అతని ఆశలన్నీ అడుగంటిపోయాయి.

"మనం బీదవాళ్ళం! గొప్పవాళ్ళింటికి బీదవాళ్ళు వెళ్ళకూడదు నాయనా!" అంది గొప్ప బీదల తారతమ్యం తెలిసిన ఆ తల్లి. కాని యిదేమీ గోపీకి నచ్చలేదు. వాళ్ళు గొప్పవాళ్ళేమిటి? తను బీదవాడేమిటి? "అమ్మా! మరి వాళ్ళ మురళి పిలిచాడుకదే! పిలిస్తే ఎందుకెళ్ళకూడదు?" అన్నాడు సందేహం తీరక! "మురళి చిన్నపిల్లవాడు కదూ! అందుకని — చిన్న పిల్లలు పిలిస్తే వెళ్ళకూడదమ్మా!" అని సర్దబోయింది. "మరయితే ఎవరు పిలిస్తే వెళ్ళాలమ్మా!" అని ఎదురు ప్రశ్న వేశాడు గోపీ! "పెద్దవాళ్ళు పిలవాలి నాయనా! డాక్టరుగారే పిలవాలి! ఆయన పిలిస్తేనే వెళ్ళాలి!" అంది. "మరి పుట్టినరోజు మురళిదైతే ఆయనెందుకమ్మా పిలవడం! మురళే పిలవాలిగా!" అన్నాడు ఎలాగైనా తల్లిని ఒప్పించాలని! "చిన్న పిల్లలకు ఏమి తెలియదు నాయనా!" అని యింకా యేమేమో అనబోయింది. "అమ్మా! అమ్మా! అయితే నా పుట్టినరోజుక్కూడ నాన్నను టీపార్టీ చెయ్యమనవే!" అన్నాడు గారాబంగా! కొడుకు పుట్టినరోజు పండగ మాటెత్తేసరికి ఆ మాతృహృదయం మధనపడింది క్షణం సేపు. గోపీ పుట్టినరోజు రెండు మూడు రోజులక్రితమే గడిచిపోయింది. ఆనాడు బియ్యంలేక తల్లితండ్రులిద్దరూ పస్తుండి కొడుక్కి కాస్తగంజికాచిపోశారు. "అలాగేలే!"

అని లేవబోయింది కొడుకు యిప్పటి టీపార్టీమాట మర్చిపోయాడనుకుని. "మరయితే యివాళ.....!" అంటూ చీరకొంగు పట్టుకుని అడిగాడు. కొడుకుని చూసేసరికి జాలివేసింది. "సరేలే!" అని మాత్రం అనగలిగింది. "అమ్మా! నువ్వు చాల మంచిదానివే!" అన్నాడు గోపీ అమాయకంగా!

కొడుకును టీపార్టీకి పంపుతానందేకాని ఏ బట్టలు తొడిగించాలో, ఎలా పంపాలో అర్థం కావడంలేదు. వాళ్ళు చూస్తే సిల్కు చొక్కాలు తొడుగుతారు! తన కొడుక్కు చూస్తే చిరుగుల చొక్కాలు! గోపీ అన్నం తిని చెయ్యి కడుక్కుని బయటకొచ్చేసరికి తండ్రి వచ్చాడు కంపెనీనుంచి. "నాన్నా! నాన్నా! నే టీ పార్టీ కెడుతున్నా" నంటూ మీదపడ్డాడు గోపీ! సంతోషం పట్టలేక

గోపీని చంకనెత్తుకుని "ఎక్కడ నాయనా!" అన్నాడా తండ్రి! "మాబళ్ళో మురళి పుట్టినరోజు నాన్నా! మురళి నెరుగవూ! డాక్టరుగా రబ్బాయి! నన్ను తప్పకుండా రమ్మన్నాడు" అంటూ చెప్పుకు పోతున్నాడు ఆనందపరవశత్వంతో!

"అమ్మా! అమ్మా! తలదువ్వవే! అప్పుడే నాన్నొచ్చేశాడు! ఒంటి గంటయిపోయింది. మూడింటికే టీపార్టీ! నువ్వేపనీ సరిగ్గా చెయ్యవే!" అన్నాడు గోపీ. "పంపుతానన్న దానివి మరి ముస్తాబు చెయ్యవేం?" అన్నాడు భర్త. ముస్తాబంటే ఏం చెయ్యాలనో! అయినా ఏమున్నాయని ముస్తాబు చెయ్యడాన్కి! మంచి మంచి గుడ్డలా ఏమన్నానా? ఇక ఎలాగూ తప్పదని ఉతికినవే చిరిగినచోట కుట్టి, శుభ్రంగా నీళ్ళుపోసి, తలదువ్వి, తొడిగింది. గోపీ ఆనందానికి అంతులేదు. తనుకూడ టీపార్టీకెడుతున్నాడు. అక్కడస్కూలు పిల్లలందర్నీ కలుసుకుంటాడు. అంతా కలిసి గంతులేస్తారు. మేష్టారు కూడ వస్తారు. ఇవాళ ఎంచక్క పాఠాలు అడగరు. మురళి ప్రక్కనే కూర్చుంటాడు తను. కావలసినన్ని లడ్డూలు అవి తినొచ్చునని చెప్పాడు మురళి. తన కడుపు నిండినన్ని తిని మురళి నడిగి కొన్ని అమ్మకు నాన్నకుకూడ తేవచ్చు. యింకా...యింకా...ఇలాంటివెన్నో ఆలోచనలతో నిండిపోయిందా చిన్ని బుర్ర.... "నాన్నా! నువ్వు కూడా రా! నాన్నా!" కాని నాన్నేడి? అప్పటికే వెళ్ళిపోయాడు కంపెనీకి! "అప్పుడే రెండయిందమ్మా—అయితే యింకొక గంటన్నమాట!" అన్నాడానందంతో! గంటలో పిండివంటలన్నీ తింటానుకదా అని ఉవ్విళ్ళూరుతున్నాడా పసికందు. "ఈసారి మానెయ్యి గోపీ! గొప్పవాళ్ళతో మనకు పొత్తు కుదురదు" అని చెప్పి చూసింది. కాని గోపీ ఆ మాటల్ని పెడచెవిని పెట్టాడు. ఆతల్లి యికచెప్పలేక పనిచూసుకొందుకు వెళ్ళిపోయింది. గోపీ పుస్తకాలన్నీ సర్దుకున్నాడు. తన పలకా పుస్తకాలు అన్నీ జాగ్రతగఒకచోట దాచుకున్నాడు. క్రాపు చెరిగిపోయిందేమోనని మళ్ళీ దువ్వుకున్నాడు. అద్దమ్ముక్కలో తనముఖం చూచుకుని మురిసిపోయాడు. మురళీకన్న తానే అందంగా ఉన్నాడని ఆనందంతో పొంగిపోయాడు. తన పుట్టిన రోజుకూడ అమ్మ టీపార్టీ చేస్తుంది! తనుకూడ మురళిని పిలుస్తాడు. మురళికూడ తనలాగే ముస్తాబై చక్కగా వస్తాడు! అమ్మ అన్నిరకాల పిండివంటలు అంటే — జంతికలు, చేగోడీలు, గార్లు చేస్తుంది. ఇలా ఏవేవో ఊహించుకుంటూ బయలుదేరాడు మురళి యింటికి! "అమ్మా! నే వెళ్ళిపోతున్నా! తలుపేసుకో!" అంటూ పరుగెత్తాడు. "జాగ్రత నాయనా! బళ్ళు అవీ...." అంటూ యింకా ఏమో చెప్పబోయింది. కాని గోపీ అప్పటికే చాలదూరం సాగిపోయాడు.

## 2

ఆహ్వానాల నంగీకరించి విచ్చేసిన అతిధులతో నిండిపోయింది డాక్టరుగారి బంగాళా! బంగాళా ముందు వరుసలో నిలబడ్డాయి కార్లన్నీ. బంగాళాముందు ఖాళీ స్థలంలో మంచి మంచి పూల మొక్కలు, క్రోటనులు. కంటి కింపుగా పెంచారు. వచ్చేవాళ్ళు ఆ మొక్కల అందాన్ని తిలకించనిదే లోనికి వెళ్ళడంలేదు. లోపల పెద్ద హాలు. హాలునిండా లెక్కలేనన్ని కుర్చీలు. సోఫా లున్నా. పైన పంకాలు. హాలుమధ్య పెద్ద కుర్చీ వేశారు. ఆకుర్చీ కెన్నో అలంకారాలు చేశారు. అప్పుడే చాలామంది వచ్చి ముందు కుర్చీల్లో కూర్చున్నారు. వచ్చే అతిధులందర్నీ స్వయంగా ఆహ్వానించి డాక్టరుగారు కరస్పర్శలు చేస్తున్నారు. కాని డాక్టరుగారు మాత్రం ఎవరికోసమో వెతుకుతున్నట్టు కనిపిస్తున్నారు. ఎవరికోసమో ఎవరికీ తెలియడంలేదు. టి పార్టీ కన్నీ సిద్ధం చేయబడ్డాయి. అందరూ ఎప్పుడు ఆరగిద్దామా అని ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు. డాక్టరు గారు మాత్రం హడావిడిగా అటూ యిటూ తిరుగుతున్నారు. ఆ బంట్రోతు నొకసారి, యీ నౌకరు నొకసారి కేకలేస్తున్నారు. పిలిచి చెవిలో ఏదో చెప్తున్నారు. వాళ్ళు ఖంగారుగా పరుగెడుతున్నారు. వచ్చిన ఆడవాళ్ళందర్నీ ఆదరించడంలో నిమగ్నురాలయింది డాక్టరుగారి భార్య.

ఇంతకూ ఎవరికోసమైతే యీ పార్టీ ఏర్పాటు చేశారో ఆ ముద్దుల మురళి కనపడటంలేదు. అసలు యింట్లో ఉంటేగా కనపడడానికి. గదులన్నీ గాలించారు. దొడ్లో వెతికారు. ఎక్కడా కనపడలేదు. తల్లి ముస్తాబు చేసి హాల్లోకి పంపింది. ఇంతలోనే ఎక్కడికి మాయమయ్యాడో కదా! డాక్టరుగార్కి ఆత్రమెక్కువయింది. కంగారుగా బయటి కొచ్చాడు. వచ్చిన వాళ్ళలో గుసగుసలు బయలుదేరాయి. వాళ్ళకేం! ఇంతలో బయట గేటు దగ్గర ప్రత్యక్షమయాడు మురళి గోపీతోసహా.



డాక్టరు గారికి ఏం చెయ్యాలో తోచలేదు. ఆమురికి ముష్టి వెధవని వెంటబెట్టుకొచ్చాడని మురళిపై కోపం వచ్చింది. కాని సమయానికి కనిపించాడని సంతోషించారు. ఆ సంతోషంలో యీ కోపం మర్చిపోయారు. గబగబ పోయి మురళి నెత్తుకుని వచ్చారు. గోపీకి ఏం చెయ్యాలో తోచలేదు. మురళి చూడ్డానికి చాల ముచ్చటగా ఉన్నాడు. పులెను సూటు కుట్టించారు డాక్టరుగారు. ఆ సూటులో నిజంగా డాక్టరులాగే ఉన్నాడు మురళి. మురళిని తీసికొచ్చి హాలుమధ్య కుర్చీలో కూర్చోబెట్టారు. అతిథుల్లో కొందరు ఫొటోలు తీశారు వచ్చిన వాళ్ళంతా తెచ్చిన కానుకలన్నీ బహూకరించారు.

తన మేష్టారు, పిల్లలు అంతా వస్తారు. అంతా కలిసి ఆడుకోవచ్చునని ఎంతో అనుకున్న గోపీకి యిదంతా వింతగా తోచింది. తన మేష్టారు లేరు. పిల్లలు లేరు. ఏంచెయ్యాలో తెలియలేదు. అంతా తింటూంటే తనకూ నోరూరింది. గేటు లోపలకి వచ్చేడన్న మాటేగాని హాలు దగ్గర గుమ్మం దాటలేకపోయాడు. అక్కడే దిగాలుపడి నుంచుని చూస్తున్నాడు తాను మురళి ప్రక్కన కూర్చుంటాడని భ్రమించాడు. కాని మురళి యిపుడు మాట్లాడే పరిస్థితిలో లేడు. ఇంతలో డాక్టరుగారు ఏదో పనుండి లోపలి కెళ్ళారు. "ఏయ్! యిక్కడున్నావేం? ఫో! బయటకు ఫో!" అంటూ మెడపట్టుకు గెంటా డొక నౌకరు గోపీని. దాంతో అందరు ఆహ్లాదంతో వెకిలిగ నవ్వారు తామేదో పెటి పుట్టినట్టు. ఈమాటలు మురళికి వినిపించాయి. వెంటనే లేచివెళ్ళి గోపీని తీసుకొచ్చి ప్రక్కన కూర్చోపెట్టుకున్నాడు.

తనతో తినమన్నాడు. అతిథులందరూ ఆశ్చర్యపోయారు. ఈసారి మరింత వెకిలిగ నవ్వాడు. మరింత గోలయింది. గోపీ బిత్తరపోయాడు. భయం కల్గిందా పసి కందుకు. ఎందు కొచ్చానా అనిపించింది. టీ పార్టీ అంటే ఎన్నో తినవచ్చు ననుకున్నాడు. కాని ఇప్పు డివన్నీ కంటికి భయంకరంగా కనిపిస్తున్నాయి. "భయపడతావేం! గోపీ! తిను" అంటూ ప్రోత్సహించిన మురళి మాటలతో గోపీ ఒక లడ్డూ తీసికొని నోట్లో పెట్టుకో బోయాడు. ఇంతలో డాక్టరుగారొచ్చారు. మురళి ప్రక్కన గోపీని చూచి ముక్కుమీద వేలేసికొన్నారు తన కొంపేదో మునిగి పోయినట్టు! ఈ సారి డాక్టరు ఉద్రేకపూరితులయ్యారు. ఆవేశం పట్టలేక గోపీని లాగి క్రిందకు పడతోశారు. "ముష్టి వెధవా! మా వాడిని పాడుచేద్దామని వచ్చావా?" అంటూ నౌకరును పిలిచి బయటకు గెంటేయ్యమన్నాడు. గోపీ చేతిలోని లడ్డూ క్రిందపడి ముక్కలై పోయింది. మురళి మాత్రం బిక్క మొహంతో "నాన్నా! గోపీని పిలవ్వా!" అన్నాడు ప్రాధేయపూర్వకంగా. "తప్పమ్మా! అలాంటి వాళ్ళతో మాట్లాడకూడదు! ముష్టి వెధవ! వాడితో యీ రోజు నుంచి మాట్లాడకు!" అన్నాడు కాని మురళి మాత్రం యీ మాటలతో ఊరుకోలేదు. గబగబ లేచి పోయాడు. తండ్రి అడ్డు వెళ్ళి వెనక్కి తీసికొచ్చాడు. గోపీని నౌకరు "ఫో! వెధవా!" అంటూ గేటులోంచి ఒక్క తోపు రోడ్డు మీదకు తోసిగేటు వేశాడు.

గోపీ కాళ్ళీడ్చుకుంటూ చేరుకున్నాడు యిల్లు. తల్లి కొడుకుని చూచి బావురుమంది. తల్లిని కావిలించుకున్నాడు. ఒళ్ళోకి తీసుకొని లోనికెళ్ళి మంచంమీద పడుకో బెట్టిందాతల్లి.

## 3

"ఇంకే టీపార్టీకి వెళ్ళనమ్మా!" అంటూ బావురుమన్నాడు తల్లిని చూసి. తల్లి కేం అర్థం కాలేదు. "ఏం నాయనా! ఏం జరిగింది?" అంటూ ఆత్రంగా అడిగింది. "ఇంకే టీపార్టీకి వెళ్ళనమ్మా!" అన్నాడు మళ్ళీ ఏడుస్తూ. ఇంతలో కంపెనీనుంచి తండ్రి వచ్చాడు. తల్లి దండ్రు లిద్దరూ దిగాలు పడి మంచందగ్గర కూర్చున్నారు ఇంతకూ ఏం జరిగిందో వాళ్ళకు తెలియనేలేదు.

"ఏం జరిగింది గోపీ?" మెల్లగా బుజ్జగిస్తూ అడిగాడు తండ్రి.

"అక్కడ కొట్టారు నాన్నా! ఇంకే టీపార్టీకి వెళ్ళనులే! అమ్మా!" అంటూ మెల్లిగా చెప్పాడు.

# ★ పిచ్చి పుల్లయ్య ★

కుమారి జంధ్యాల రాధ

కంకిపాడు అనే గ్రామంలో కిష్టయ్యా అతని తల్లి సుబ్బమ్మ నివసించేవారు. కిష్టయ్యకు పాతికేళ్లు ఒచ్చాయన్న మాటేకాని బుర్ర కొంచమైనాలేదు. అతని తల్లి నలుగురిలో తిరుగుతూ వాళ్ళతో మంచిగా వుండి కొడుకును పెద్దవాణ్ణి చేసింది. కిష్టయ్యకు చిన్నతనంలోనే పెళ్ళయింది. అయినా కిష్టయ్య కది తెలీదు.

అందరూ తమ భార్యలని పిల్చుకు రావటం మళ్ళీ తీసికెళ్ళటం చేస్తూవుంటే తనూ అల్లా చెయ్యాలని బుద్ధేసింది కిష్టయ్యకు ఓరోజున. వెంటనే తల్లిదగ్గర కెళ్ళి "అమ్మా! నాకు పెళ్ళయిందటే?" అనడిగాడు. సుబ్బమ్మ అతడి ప్రశ్నకు సంతోషించి "అయిందిరా బాబూ!" అంది. కిష్టయ్యా అమాయకంగా "అయితే నేనూ వెళ్ళి మన పెళ్ళాన్ని పిల్చుకురావాలికదూ?" అనడిగాడు కొడుకు. ఈవిధంగానైనా తెలివొస్తుందేమోనని సుబ్బమ్మ "అలాగే వెళ్ళి పిల్చుకొద్దువుగానిలే" అనిచెప్పి ఓ మంచిరోజు చూసి కొడుకును ప్రయాణం చేసింది.

వెళ్ళేటప్పుడు ఆమె కొడుకుతో చెప్పింది. "నీవు ఆయింటి అల్లుడవు. అందులో యిప్పుడే కొత్తగా వెళుతున్నావు. బాగా దర్జాగా ప్రవర్తించు. వాళ్ళు కింద కూర్చుంటే వాళ్ళకి సరిగ్గా నువ్వు కూచోవాల్సిన పనిలేదు. కాస్త ఎత్తులో ఏదైనా వుంటే దానిమీద కూచో." అని ఇంకా ఏవేవో చెప్పింది.

కిష్టయ్యా తల్లి మాటల్ని బాగా జ్ఞాపకం వుంచుకొని తన వూరికి పది మైళ్ళ దూరంలో వుండే "అంకిరెడ్డి పాలెం" నడిచివెళ్ళి అత్తారిల్లు చేరాడు. ఇంట్లో బయట తట్టు ఎవరూ లేరు. కిష్టయ్యా వెళ్ళి పలుకరిస్తే ఏం బావుంటుంది. తను ఆయింటికి అల్లుడుకదా! అనుకుని ఇక్కడే ఉండటం మంచిదనుకున్నాడు. మళ్ళీ నిలబడటం ఎందుకా అని తల్లిమాట గుర్తుకొచ్చి అక్కడేదన్నా కుర్చీ గిర్చీ ఉందేమోనని చూశాడు. కాని ఏమీలేవు. అది రైతుల ఇల్లు కాబట్టి ఓచోట ఎత్తుగా పిడకలు పేర్చి ఉన్నాయి. భేష్ ఇది బావుందనుకుని వాటిపైకెక్కి భద్రంగా దిక్కులు చూస్తూ కూర్చున్నాడు కిష్టయ్యా.

ఇంతలోకే కిష్టయ్యా బావమరది పొలంనుంచి ఇంటికి వస్తూ పిడకలమీద కూర్చున్న కిష్టయ్యాను చూశాడు. (అతడికి కిష్టయ్యా ఫలానా అని తెలీదు.) అందులో పిడకలమీద కూర్చున్నందుకు మంచి కోపం వచ్చిందతడికి. "ఏయ్, ఎవర్రా నువ్వు ముందు దిగుతావా లేదా" అని గద్దించాడు. కిష్టయ్యా ఆమాటలు విని కొంచెంకూడా తొణక్కుండా "ఇక్కడ్రేవోయ్. నేను ఈ యింటి అల్లుడిగార్ని. పోయి ఇంటివాళ్ళతో చెప్పు." అన్నాడు దర్జాగా. అతని బావమరది వెటకారంగా "ఓహో అలాగేం. నేనే మీకు చేయూతనిచ్చి ఇంటిలోకి పిల్చుకు వెడతాను బావగారూ" అంటూ దగ్గిరకొచ్చి కిష్టయ్యా చెయ్యి పుచ్చుకుని జర్రున లాగాడు. పిడకలన్నీ కూలి పొయ్యాయి. "దొంగ వెధవా, ఫో బయటికి" అంటూ కర్ర పుచ్చుకునేసరికి వాళ్ళమ్మతో రోజూ తినే దెబ్బలు గుర్తుకొచ్చి వీధిలో పడి పొలిమేరవరకూ తిరిగి చూడకుండా ఒక్కటే పరుగు తీశాడు కిష్టయ్యా.

తల్లి సుబ్బమ్మ కొడుకు కిష్టయ్యా సంగతంతా తెలుసుకున్నాక "ఓరి తిక్కన్నా. అత్తారింటి కెళ్ళినవాడవు అందరూ క్షేమమేనా మీ తట్టు వాన లెట్లున్నయి. అవేమిటి? ఇవేమిటి అంటూ కలుపుకుని మాటాడక పోయి ఎత్తుగా వున్నది చూసి కూచోమంటే పిడకలమీద కూచుంటార్రా ఎవరైనా" అని మందలించి తర్వాత "పోనీలే" అంటూ ఓదార్చింది.

కాలచక్రంలో మూడునెల్లు తిరిగిపోయేయి. కిష్టయ్యాకి మళ్ళీ అత్తారింటి కెళ్ళాలని బుద్ధిపుట్టింది. వెళ్ళాడు.

దురదృష్టవశాత్తు ఆరోజే అత్తారిల్లు కాలుతూవుంది. సామానంతా ఇంటిముందు పడేసుంది. అందరూ హడావిడిగా బిందెల్తో కడవల్తో నీళ్ళు ఎత్తుకొచ్చి పోస్తూ వున్నారు కాలుతున్నచోట. కిష్టయ్యా అత్తారింటికొస్తూ "ఏమండీ అత్తగారూ! అంతా క్షేమమేనా, బావ క్షేమమేనా" తన పెళ్ళాం కులాసాగానే వుందా? ఇది మీ యిల్లులాగానేవుందే. ఇల్లంతా శుభ్రం చేయిస్తున్నారా నీళ్ళతో" అంటూ దగ్గిరకెళ్ళి ప్రారంభించాడు కిష్టయ్యా.

అతడి గురించి తెలుసు గనక తన తల్లిని యిట్లా వేధిస్తున్నావేమిటి అని దగ్గరకొచ్చి "మళ్ళా వచ్చేవేమిరా? దొంగ వెధవా?" అని దగ్గరున్న వాళ్ళను పిల్చి "వీడెవడో పిచ్చి వెధవ. ఇల్లు కాలుతూంటే శుభ్రం చేస్తున్నారా అని అడుగుతున్నాడు." అని చెప్పాడు. వాళ్ళకు ఈమాటలు వినేటప్పటికి కిష్టయ్యమీద మంచి కోపం వచ్చింది. కొంతమంది కలిసి కొద్దిగా నాలుగు తగలనిచ్చారు. మరికొందరు ఇల్లు కాలింది మొర్రో అని వాళ్ళేడుస్తూంటే అల్లుణ్ణని వచ్చి గోల చేస్తావేరా వెధవా" అంటూ తిట్టేటప్పటికి కిష్టయ్య చేసేదిలేక మళ్ళీ కంకిపాడు రస్తా పట్టాడు.

తల్లితో జరిగినదంతా చెప్పాడు. సుబ్బమ్మ అందిగదా, "ఒరే కిష్టిగా! ఇల్లు కాలుతూంటే చూస్తూ వూరికే ఎల్లాగున్నావురా? ఏదో సామాన్లు బయట పారెయ్యడమో, నీళ్ళు తెచ్చి పొయ్యడమో చెయ్యాలిగాని. ఊరుకుంటార్రా ఎవరన్నా? నీదే తప్పు" అంటూ కిష్టయ్యను ఓదార్చింది. అతను కూడా తనదే తప్పని సమాధానపడ్డాడు.

కాల ప్రవాహంలో నాలుగు నెల్లు కొట్టుకుపోయాయి. కిష్టయ్య మనసులో అత్తారింటి కెళ్ళాలన్న ఆలోచనకూడా దొర్లింది. సరే వెళ్లాడు. ఈసారి అతడి బావమరది పెళ్ళి జరుగుతూంది. ఇంటి ముందు బాగా హడావిడిగా వుంది. కిష్టయ్య అంకిరెడ్డి పాలెం (అత్తారి వూరు) చేరే వేళకు బాగా చీకటైంది. ఇంటిముందు కాగడాలు వెలుగుతున్నాయి. మన కిష్టయ్య దూరం నుంచి ఈ కాగడాల్ని చూస్తూనే ఓహో ఈసారి కూడా అత్తారిల్లు కాలుతూవుంది. సమయానికే వచ్చాను. అనుకొని పరుగెత్తుకుంటూ ఇంట్లోకి వెళ్లాడు అందర్నీ తోసుకుంటూ. అక్కడున్న పెళ్ళికొచ్చిన వాళ్ళ పెట్టెలు రెండు విసిరి అవతల పారేసి తన బావమరది అక్కడ కూచుని ఎవరితోనో మాట్లాడుతుంటే చెయ్యి పట్టుకుని లాగుతూ రావోయి బావా! బయట నుంచి యిల్లు కాలుతూవస్తూంది. అని అన్నాడు. అక్కడున్న కొందరు కిష్టయ్య సంగతి తెలిసిన వాళ్లు అతడిని బయటికి లాక్కెళ్ళి ఎక్కడ కాలుతోందోయ్ అని అడిగారు. కిష్టయ్య కాగడాల్ని చూపిస్తూ మీకేమన్నా కళ్లు పోయ్యాయా బాగా చూడండి. అని మళ్ళీ ఇంట్లోకి పోసాగాడు. వాళ్ళందరూ కిష్టయ్యని పట్టుకుని ఆపి వీడు నిజంగా పిచ్చి వెధవ అని బాగా తన్ని సాగనంపారు. ఇంకోసారి వస్తే దేహశుద్ధి తప్పదని కూడా చెప్పారు.

పాపం కిష్టయ్య ఆకలితో ఆరాత్రే పది మైళ్ళు నడిచి కంకిపాడు చేరాడు. తల్లితో పూసగుచ్చినట్లు జరిగిన సమాచారమంతా చెప్పాడు. తల్లి సుబ్బమ్మ పోనీలే నాయనా, మరి పెళ్ళి జరుగుతూవుంటే ఎవరన్నా ఇల్లు కాలుతోంది అంటారా చెప్పు. ఇంటిముందు మేళతాళాలు ఆసందడీ చూచే అది పెళ్లి ఇల్లని గుర్తించవచ్చునే. అంటుండగానే కిష్టయ్య సరే అవన్నీ అట్లావుంచి ముందు నాకు అన్నం పెట్టు అన్నాడు.

కిష్టయ్య మళ్ళీ అత్తారింటి మాట మర్చిపొయ్యి ఓ ఆరునెలలు గడిచాయి. ఈమారు ఒక్కసారికి వెళ్ళి ఇక వెళ్ళనే వెళ్ళకూడదు అనుకుని ప్రయాణమయ్యాడు. కర్మంగాలి ఆరోజే అతని మామగారు పరలోకానికి టిక్కెట్టు పుచ్చుకున్నారు. బంధువులు, బావమరది, అత్తగారూ, ఇంకా వూళ్లో తెలిసినవాళ్ళు అందరూ భోరున ఏడుస్తున్నారు. ఓ అరుగుమీద ఒకడు హార్మోనియం, ఇంకోడు తబలా. మరినలుగురు తాళాలు వాయిస్తూ "ఎన్నాళ్లుండినఇహ సుఖములలో కొన్నాళ్ళేగద మనసా!" అంటూ విరక్తి గీతం ఆలాపిస్తున్నారు.

కిష్టయ్య ఈ దృశ్యాన్నంతా చూచాడు. ఇది నిజంగా పెళ్ళే. ఇపుడు బాగా జాగ్రత్తగా ప్రవర్తించాలి అనుకొని పక్కగా చూచాడు, శవం మీద గుడ్డకప్పి వున్నది. దానిమీద పడి అత్తగారు మొగుడి గుణాలు నెమరువేస్తూ ఏడుస్తోంది. కిష్టయ్య దీన్ని చూచి ఇంకా బాగా యాధి చేసుకున్నాడు ఇది పెళ్లేనని. ఎందుకంటే ఎవరింట్లోనో తల్లి కూతురును అత్తగారింటికి పంపేటప్పుడు ఏడ్చింది. ధైర్యంగా అత్తగారి దగ్గరకొచ్చి ఏమిటండోయ్ అత్తగారు, శుభమాని అత్తారింటికెడుతూంటే మీదపడి ఏడుస్తారేమండీ? ఏనాటికైనా అక్కడికెళ్ళక తప్పుతుందా! అంటూ తన పిచ్చివాగుడు ప్రారంభించాడు. మీరుకూడా అత్తవారి వూరువెళ్ళి విడిచి రండి అని కూడా అన్నాడు.

అక్కడ వున్న వాళ్ళందరూ ఇతని సమాచారం తెలిసినవాళ్ళే కనక మళ్ళా ఈ పిచ్చివాగుడువిని మరింత కోపంతో మళ్ళీ వచ్చావా? దేహశుద్ధి తప్పదు అని చెప్పామే అంటూ వస్తూండగానే కిష్టయ్య క్రూడా మూడుసార్లు యీసంగతి అనుభవమే కనుక ఇప్పుడు కూడా అదే జరుగబోతుంది అనుకొని తిరిగి చూడకుండా ఒకే పరుగున కంకిపాడు గ్రామంలోని తన ఇంటికి చేరుకున్నాడు. పాపం కిష్టయ్య పిచ్చి పుల్లయ్య అయిపొయ్యాడు. కిష్టయ్యలాంటి పిచ్చిపుల్లయ్యలు వున్నారంటే నమ్ముతారా?




నన్నయ గీసిన గీఁతను
చిన్నయ సూరియె యొకింత చెఱిపెను ; దానిన్
పిన్నలు ద్రిప్పిరి తా మను
కొన్నట్టుల. ఇంపు - సొంపు గూర్చిరి సుమతీ !

తమ్ముల చేఁతల నన్నలు
వమ్మొనరింపంగఁ బూన భావ్యమ్మగునా ?
ఇమ్మింతవఱకె యని, తెలుఁ
గమ్మను నిల్పంగ శక్యమౌనా ? సుమతీ !

దిన దిన మభివృద్ధిం గను
తెనుఁగు కడలి యొక్క-రీతిఁ దిరుగునెయెపుడున్ ?
ఘనుఁ డెవ్వఁ డడ్డుపడు ? అది
కన విన సొంపుగఁ జరింపఁగావలె సుమతీ !

గిరులందు మేరువుం బలె
సురలందు మహేశురీతి శోభిలు తెలుఁగున్
సరిపోలునె ? యెన్నండున్
ధరఁ గల యేభాషయైనఁ, దలఁపుమి ! సుమతీ !

తియ్యని మన తెలుఁ గమ్మను
వియ్యమ్మున కెల్లభాస - వెలఁదులు గలయన్
సయ్యాటింపక సరి యనె
అయ్యారె ! మతు లద్వితీయు లాంధ్రులు సుమతీ !

తెలుగుం దెలిపెడు నొజ్జకు
నిఱ గడవఁగ నీక జీత మిడుదురు పెద్దల్
మలమల మాఁడెడు కడుపున
వెలయును మృదు మధుర భాష, వినురా సుమతీ !

అక్షర మెఱుఁగని వారిని
శిక్షించి, శ్రమించి విద్యఁజెప్పెడి వారిన్
కుక్షింభరులుగఁ జేయని
దక్షుల నధిపతుల దూఱఁదగదా ? సుమతీ !

బ్రతుకుం దెరువుం గానక
మతి చెడి శిక్షకుఁడు బడిని మైమఱచినచో
చతికిలఁబడి విద్యార్థులు
పతితులు గారా ? తలంపవలదా ? సుమతీ !

గురు పదగౌరవ భంగుఱ
గఱపక పాఠములు శిష్యగణమున కెపుడున్
హరియింత్రు వేతనమ్ములు
త్వరగా నట్టిడుల వీడఁదగదా ? సుమతీ !

తొలుదొల్త ఓనమాలను
బలికింపఁ దలంచునట్టి భావమదేదో
తెలియని గురువులు నేఁటికిఁ
గలిగిరి శిష్యులకు విద్య గఱపఁగ సుమతీ !



## అన్ని నొప్పులకు

# అమృతాంజనము

**60**

సంవత్సరముల
సేవచే
పేరొందినది!




## అమృతాంజన్ లిమిటెడ్

మద్రాసు
బొంబాయి
కలకత్తా




"ఏమండోయ్ ! మిమ్మల్నే !"

"... ... ... ..."

"వినిపించుకొని, పల్కరించరేం ?"

"... ... ... ..."

"పల్కరిస్తే నోటి ముత్యాలు రాలిపోతాయా ?"

"... ... ... ..."

"రెండు ఆత్మలూ ఒకటే అనీ, ఆకసం ఒరిగినా, భూమి విరిగినా, సముద్రం తరిగినా, మనం ఎప్పుడూ విడిపోమనీ ప్రమాణం చేశారు. మరచి పోయారా గర్భగుడిలో దేవుడిముందు."

"... ... ... ..."

"పోనీ పగలు విడిపోయినా, రాత్రులుకూడా ఇదేమి కర్మమండీ !"

"... ... ... ..."

"ఇంత అర్ధ రాత్రి ఆకాశం నిండా నక్షత్రాలు, భూమి మీద పుచ్చపువ్వులాగ వెన్నెల, విరబూసే జాజి లతలనుంచి సౌరభం, నన్ను విసుగెత్తిస్తున్నాయి."

"... ... ... ..."

"నాలుక పిడచ కట్టుకొని పోతోంది. అరచి అరచి ప్రాణాలు పోతున్నాయి. అబ్బబ్బ ! ఒక్కసారి ఇటు మొఖం త్రిప్పండీ."

"... ... ... ..."

"ప్రపంచమంతా మనదేదో ఆదర్శ దాంపత్యమని అనుకుంటోంది. ఉన్న విషయం తెలిస్తే నవ్వరా ?"

"ఏమిటీ గోల. ఒకటే కాకిగోల. మంచి సస్పెన్స్‌లో ఉంటే. పానకంలో పుడకలాగ."

"తిక్క ఇప్పుడు తిరిగిందన్నమాట. ఏమిటా చచ్చు పెన్ను."

"కాస్సేపు నిశ్శబ్దంగా వుంటే నీకు పదివేల నమస్కారాలు."

"కాస్సేపు కాస్సేపని 8 గంటలనుంచి అంటున్నారు."

"ఐపోవచ్చింది. రామాన్ని చంపేస్తున్నా."

"ఏ రామాన్ని. మన ఇంటికి రోజూ వచ్చే మీ స్నేహితుడు, అతన్ని చంపేస్తున్నారా ? మీకేమైనా మతి పోయిందా ? లేకపోతే మేలుకొనే పలవరిస్తున్నారా ? ఈ విషయం పోలీసులకు తెలిస్తే ఇంకేమైనా ఉందా ? పండులాంటి సంసారం నట్టేట్లో కలుస్తుంది."

"... ... ... ..."

"ఎందుకట్లా నవ్వుతారు ? మీ మనస్సు ఎట్లాగ ఒప్పుకుందండీ ? మీ కాళ్ళు పట్టుకుంటానుగాని అటువంటి పనులు చేయకండి. అయినా అతడు మిమ్మల్ని ఏంచేశాడని ?

"... ... ... ..."

"ఇంకా నవ్వుతూనే ఉన్నారా ? మీకు నిజంగా మతి పోయి ఉంటుంది. మీ వాలకం చూస్తుంటే నన్నుకూడా చంపేటట్లున్నారు."

"ఎందుకట్లా అరుస్తావు. చంపేది మన రామాన్ని కాదే, మన కథానాయకుడు రామాన్ని. ఇంతలో ఎంత రాద్ధాంతం చేశావు?"

"మీ రిటువంటి కథలు వ్రాసే, కొంపకు నిప్పు అంటిస్తున్నారు. మా నాన్న మీకేమి అపకారం చేశాడని, అచ్చం నిజం పేరు పెట్టి ఇష్టమొచ్చినట్లు వ్రాశారు. ఊళ్లో వాళ్ళంతా ఏమైపోతే మీకెందుకు ?''

"ఈ ఊళ్లో మా మామయ్యలాంటి మామయ్యలు చాల మంది ఉన్నారు. వాళ్ళంతా కాషాయి వస్త్రాలు ధరించి, చక్కగా శ్రీరంగ నీతులు బోధిస్తూ, ప్రపంచంలో పెద్ద మనుష్యులుగా ప్రవర్తిస్తూ మోసం చేస్తుంటారు. అటువంటి పయోముఖవిషకుంభ జీవితాలను రచ్చ కీడ్చి, బుద్ధి వచ్చేటట్లు చేయాలి."

"లేకపోతే మీకు రాబోయే కట్నం పోతుంది. అంతేనా ?"

"తండ్రికి తగ్గ కూతురివి. చిన్నప్పట్నుంచి ఒకే కంచంలో తింటూ ఒకే మంచం మీద పెరుగుతూ, అన్యోన్యంగా ఉన్న అనుబంధాన్ని వేరు చేయాలని మీ నాన్న ఎందుకు ప్రయత్నించాడు ? నేను దరిద్రుణ్ణనేగా ? ఒకరి హృదయాలు ఒకరు అర్థంచేసుకొని, రాగానుబంధాలను పెంచుకొని, పెళ్ళి చేసుకోవాలని చెప్పినరోజు, మీనాన్న అగ్గిరాము డయ్యాడు. తోక తెగిన నల్లకోతి లాగ గంగిర్లెత్తాడు. విడిపోనటువంటి జీవితాలను వేరు చేయాలని పన్నాగాలు పన్నుతున్న మీ నాన్న జీవితాన్ని ఉన్నదున్నట్లు వ్రాయడంలో తప్పేముంది ?"

"తప్పా ? తప్పున్నరా ! మీరు గొప్పవారనిపించుకోవడానికేనా ఈ ప్రయత్నం. చాల్లెండి. నా కటువంటి రాతలంటే వళ్లు మంట."

"అంత వళ్ళు మంటగా ఉంటే మూడవ పంచవర్ష ప్రణాళికలో ఒక ప్రాజెక్టు కట్టించు. సముద్రంలో కలవకుండా, ఆ నీరంతా మీ ఇంట్లోకే వస్తుంది. శరీరం చల్లబడుతుంది."

"మా నాన్నంటే మీకంత వెక్కిరింపుగా ఉంది. మా నాన్న తలుచుకుంటే ఏమైనా చేయగలడు."

"ఒక్కటడుగుతాను చెప్పు. అంత ఘనుడైతే నీ మనస్సు మార్చగలడా ?''

"... ... ... ..."

"మాట్లాడవేం."

"ఏదో గారడీ చేసి, మా నాన్న కళ్ళకు కారంకొట్టి, బుట్టలో వేసుకున్నారు.''

''నా కాలాన్నంతా దుర్వినియోగం చేస్తున్నావు. కాస్త కథ వ్రాసుకోనియ్యి."

"నిజంగా మీ కథానాయకుణ్ణి చంపేస్తున్నారా ? నాకెందుకో ఏడుపు వస్తోందండీ !''

"ఏడుపు వస్తుందని ఎవరూ అనరు. ఏడుస్తారుగాని. సరి... కొంపదీసి మాకథానాయకుణ్ణి ప్రేమించలేదుకదా?"

"అటువంటిది జరిగితే, మీ కథానాయకుడి ప్రాణం అటుంచి, ముందు నా ప్రాణం తీస్తారు.''

"నిన్ను ఒక్కటడుగుతాను. నిజం చెబుతావా ?"

"మీదగ్గర ఎప్పుడైనా అబద్ధాలాడానా ! మీరే అప్పుడప్పుడు కక్కుర్తి పడతారుగాని"

"ఇంతవరకు వ్రాసిన కథ చదివేవు కదా ! రామం మీద నీ అభిప్రాయం ?"

"నేను చదవలేదు. బలవంతంగా మీరే చదివి వినిపించారు."

"అబ్బ ! చంపక చెపుదూ !"

''నిర్మొహమాటంగా నిజం చెప్పమంటారా ?"

''నిజం కావాలి. అసలు నేను బ్రతికేది నిజంకోసమే! నిజం కోసం పుట్టాను, నిజం కోసం బ్రతుకుతున్నాను. నిజం కోసం ప్రాణాలు ధారపోస్తాను."

"సత్య హరిశ్చంద్రు లయితే అయ్యేరుగాని, మీ నిజాన్ని నిలబెట్టుకోవడం కొరకు నన్ను మాత్రం ఎవరికీ చంద్రమతిలాగ విక్రయించకండి. మా నాన్న సంగతి మీకు బాగా తెలుసుగా !"

"ఆ యమధర్మరాజు గురించి చెప్పకపోతే, నా కథ గురించి చెప్పకూడదూ ?"

"చదువుకున్న ఏ ఆడదీ మీ కథల్ని మెచ్చుకోదు "

"ఎందుకని ?"

"పెళ్ళి కాని ఆడ పిల్లలు నీతికి దూరమవుతారేమోనని."

నా కథా నాయకుణ్ణి పెళ్ళికాని పిల్లలంతా ప్రేమిస్తా



రంటావు. శభాష్! అదే నాకు కావలసింది. అందుకనే కథానాయకుణ్ణి చంపేస్తున్నాను."

"మీ తెలివి తెల్లవారినట్లుంది. అతడు మిమ్మల్ని ఏంచేశాడని అతన్ని చంపుతానంటారు."

"వేరే శరణ్యంలేదు."

"కథల్లో అందర్నీ చంపుకు తింటారు. ఇది మన సంసారానికి ఎంత మాత్రం శుభం కాదు. మొన్న పత్రికలో పడిన 'కలియుగ సమాప్తి' కథలో అందర్నీ ఏకమొత్తంగా తుదిముట్టించారటగా. పక్కింటావిడి కళ్లు ఒత్తుకుంటూ కూర్చుంది. ఆ కథ చదివిన తర్వాత మీ కామె ఏమి పేరు పెట్టిందో తెలుసా?"

"పిస్తోల్ శ్రీ"

"ఫిరంగ్ నాథ్"

"కాదు"

"అణ్వస్త్ర శాస్త్రి"

"అసలే కాదు"

"నీ తలకాయ- నా తలకాయానూ."'

"ఎందుకట్లా ఉడికిపోతారు? 'కలియుగ బ్రహ్మ' అంది."

"ఇంకా నయం. 'బ్రహ్మకపాలం' అనలేదు."

"అన్నట్లు మీ కథానాయకుణ్ణి దేనితో చంపుతున్నారండి. కథానాయకురాలు, అతని ప్రేమను తిరస్కరించి, మరొకణ్ణి ప్రేమించి వివాహం చేసుకుందని, ఆ బాధను పడలేక పిరికి పందలాగ ఆత్మహత్య చేసుకోవాలని అనుకుంటున్నాడా? పాపం! మీ కథానాయకుడికి ఎంత గతి పట్టింది."

"ఆత్మహత్య కాదే! ప్రాణత్యాగం."

"నల్లమందుతోనేనా."

"నన్ను విసుగెత్తించి నా కథంతా చెడగొట్టాలని చూస్తున్నావు."

"నన్నుకూడా అంతే చేస్తున్నారుగా. చిలకా గోరవంకల్లాగ సలక్షణంగా ఉండక, ఇంత అర్ధరాత్రి ఈ మద్దెల మేళమేమిటి? మిమ్మల్ని చూస్తూంటే కంపరమెత్తుతోంది."

"అవును. నా కథలవల్ల అభ్యుదయం రూపొందుతుంది. విజ్ఞానం పెరుగుతుంది."

"అని మీరనుకుంటున్నారు."

"నేను అనుకోవడమేమిటి? పాఠకుల దగ్గరనుంచి వచ్చిన ఉత్తరాలు ఋజువుచేస్తాయి."

"వాళ్ళంతా మీబోటి కథల పిచ్చవాళ్ళు."

"అయితే ఆడవాళ్ళు వ్రాయవలసినపని ఏమివచ్చింది. ఒకామె ఏమి వ్రాసిందో తెలుసా?"

"ఇటువంటి పిచ్చి పిచ్చి కథలు వ్రాస్తే, పరువునష్టపు దావా బనాయిస్తానంటుంది. అంతేనా!"

క్రిందటి నెలలో వ్రాసిన 'అనురాగ స్రవంతులు' కథలో సృష్టించిన 'సత్యానందం' అచ్చం తన భర్త లాంటి వాడేనని వ్రాసింది. అటువంటి కథలు ఎన్నో సృష్టించాలని నివేదించుకుంది. చూశావా? మహిళా లోకంలో మన పేరు ప్రతిష్టలు ఉజ్జ్వలమానంగా, దేదీప్య తేజంగా, శతకోటి విద్యుద్దీపాలులాగ...."

"సెమికోలన్.తర్వాత నేను మనస్సులోపూర్తిచేశాను"

"బయటకు చెపుతే అందరూ సంతోషిస్తారు."

"ఆడవాళ్ళ పేరు పెట్టి వ్రాసిన ఉత్తరాలు నిజమని నమ్ముతున్నారు. ఇంకానయం! మీ కథలను చూచి, మీ తెలివితేటలను చూచి ఆ అమ్మాయి మిమ్మల్నే ప్రేమిస్తాననలేదు."

"అటువంటివి కూడా వచ్చాయి."

"సరే! అయితే తిలోదకాలు ఇవ్వచ్చునన్నమాట."

"దేనికి?"

"దాంపత్యానికి."

"ఈ ఆడవాళ్ళకు బొత్తిగా బుర్రలు పనిచేయవు. తేలిగ్గా ప్రతి విషయాన్ని నమ్మేస్తారు. నీ మనస్తత్వాన్ని ఒక కథలో సృష్టిస్తేగాని...''

"అటువంటి పనులు చేస్తే, పరువునష్టపు దావా మా నాన్నచేత వేయిస్తాను."

"గెలిచేది ఎవరో తెలుసా ! మేము."

"కోర్టు కెక్కిన తర్వాత అన్నీ తెలుస్తాయి. అందర్నీ చంపినట్లు నన్నుకూడ మీరు కథలో చంపేస్తారు. నా తరఫున వాదించడానికి మరీ బలంగా ఉంటుంది."

ఈ రాత్రి కథ పూర్తిచేద్దామని అనుకుంటే, నా ప్రాణాలు కొరుక్కు-లింటున్నావు. నీకు పుణ్యం ఉంటుంది గాని, కాస్సేపు మ ట్లాడకుండా కూర్చోకూడదూ ?"

"నేను కథ వ్రాయనివ్వను. అతన్ని చంపుతానంటే వ్రాసిన కాగితాల్ని చింపేస్తాను."

"అతన్ని చంపితేనే నా కథకు పేరు వచ్చేది. తర్వాత నీ కీర్తి రూపొందేది."

"ఎట్లాగ చంపుతారో నేనూ చూస్తానుగా ?"

"అయితే ఎందుకు ఛంపవద్దంటున్నావు ?"

"అతడు చాల మంచివాడు. పేద ప్రజానీకానికి చాల సేవ చేశాడు. ఎంతో మందిని రక్షించాడు. పెన్నిధులు చేసే అమానుషాలను అరికట్టాడు. ప్రజలతన్ని దేవుడుగా భావిస్తున్నారు. అటువంటి మహాత్ముణ్ణి చంపుతానంటా రేమిటి ?"

"చూశావా ! మన సస్పెన్సు ఎట్లా ఉందో ? అతన్ని నిజంగా నీవు ప్రేమిస్తున్నావు. నీవేకాదు. హృదయం ఉన్న ప్రతి ఆడది ప్రేమిస్తుంది. అయితే రామాన్ని చంపడంలేదు."

"కథ అడ్డం తిరిగిందా ?"

"దేవిగారి ఆజ్ఞ !"

"సుఖాంతంగా ముగిసిన కథ సుఖాన్నిస్తుంది."

"నిజం."

---

# ★ అనునయం ★

ఎందుకయ్యా భ్రమర
నీకింతనీటు ?
తామరాకులమాటు దాగినావిదియేల ?
ఎందుకయ్యా భ్రమర
నీకింతనీటు ?

మలయానిలాన దోహల నాట్యమునుమాని
చైత్రశోభాలసిత సంగీతమునుమాని
మా మల్లికను వీడి పద్మపత్రాచ్ఛాద
సమ్మునం దిటు దాగినావేల అళిరాజ ?
ఎందుకయ్యా భ్రమర
నీకింత నీటు :

పరిహాసమా ? లేక చిరుకోపమా ? కాక
పరిరంభణ లేశ బాధా స్వరూపమా ?
మాటాడవిదియేమి ? నోటి ముత్తెములెల్ల
రాలునా ? ఈ కోపమేలనోయీ భ్రమర ?

ఎందుకయ్యా భ్రమర
నీకింత నీటు ?

క్రొందేతెలెల్ల నీకందీయ చేర్చినది
ప్రస్థపుష్ప పరిమళము నిండగూర్చినది
మామల్లి – నీకన్క-తో మాసిపోయినది
దానిని పరీక్షింప తగునటయ్యా బాబు ?
ఎందుకయ్యా భ్రమర
నీకింత నీటు ?

నీయుందె ఆనలన్ని ప్రోవుచేసినది
తరితీపు లోక యింత తెలియజాలనిది మా
మల్లికాలలన ; నీపై పంచప్రాణాలు !
దాని నిటు వేచ, బావా, నీకు భావ్యమా ?
ఎందుకయ్యా భ్రమర
నీకింత నీటు ?

— పణతుల రామచంద్రయ్య.

---



# సంక్షేమం






కేశసంస్కారము : —కుమారి దివ్యజ్ఞాన సరోజినీదేవి.

# క్షయ రోగులకు సహాయం

## సంఘ సేవకుల కృషి

శ్రీ ఎస్. హెచ్. పరిక్.

కైలాసవతి క్షయరోగంతో బాధ పడుతూ వుంది. ఆమెకు యిద్దరు బిడ్డలు. క్షయరోగుల ఆసుపత్రిలో ఆమెకు ఒక బెడ్ యిస్తామన్నారు. అందులో చేరడానికి ఆమె నిరాకరించింది. ఆమె సంగతి సంఘ సేవకునకు తెలియజేయ బడింది. ఆ సంఘ సేవకుడు ఆమె యింటికి వెళ్లి కలుసు కొన్నాడు. ఆమెతో మాట్లాడినాడు. ఆసుపత్రిలో చేరితే తాను చనిపోతాననే భయం కొలదీ అక్కడ చేరడానికి తాను యిష్టపడ లేదని ఆమె చెప్పింది. తన స్నేహితురాలొకరు ఆ ఆసుపత్రిలోనే చేరి మరణించిందన్నది.

ఆ మృత్యుభయాన్ని ఆమె హృదయంలో నుంచి తొలగించ డానికి సంఘసేవకుడు ప్రయత్నించాడు. తన స్నేహితురాలు వ్యాధి బాగా ముదిరిన తర్వాత చేరి వుండ వచ్చునని వివరించాడు. అనేక మంది జయప్రదంగా చికిత్స చేయించు కొన్న సందర్భాలు వివరించాడు. ఆమె విషయం వేరు అని, వ్యాధి ప్రారంభదశలోనే వుంది కనక ఆసుపత్రిలోచేరి చికిత్స పొందితే స్వస్థత చేకూర గలదనే ఆశించ వచ్చునన్నాడు. ఆతర్వాత కైలాసవతి ఆసుపత్రిలో చేరడానికి సమ్మతించింది.

* * *

శ్యామనాథ్ 50 సంవత్సరాల వ్యక్తి, నెలకు 300 రూపాయలు జీతం. క్షయవ్యాధి పట్టుకొంది. ఊపిరి తిత్తులవద్దపాడై పోయిన భాగం శస్త్రచికిత్సచేసి తీసి వేయాలని వైద్యులు సలహా యిచ్చారు. శస్త్రచికిత్సకు ఆయన యిష్టపడకపోగా సంఘసేవకునకు యీ సంగతి తెలుప బడింది. ఆ సంఘ సేవకుడు శ్యామనాథ్‌ను కలుసు కొని సంభాషించాడు. తనది పెద్ద కుటుంబమని, భార్య, ఏడుగురు పిల్లలు కలరని చెప్పాడు. పెద్ద కుమారుడు బి ఎస్‌సి పరీక్షలో రెండవ వాడుగా ఉత్తీర్ణుడై, ఎం. ఎస్.సి., పరీక్షకు చదువుతున్నాడు. తన కుమారుని విద్యావ్యాసంగానికి భంగంకలుగరాదని శ్యామనాథ్ అన్నాడు. తాను యింకా ఆసుపత్రిలో చాలా రోజులు వుండవలసి వస్తే తన పిల్లలగతి ఏంకాను అని వాపోయాడు. శస్త్ర చికిత్స జయప్రదంకాకపోవచ్చు నన్నాడు.

ఇదంతావిని సంఘసేవకుడు ఊపిరి తిత్తులలో కొంత భాగంతీసి వేసినా భయంలేదని, అయితే శారీరకంగా ఎక్కువశ్రమ కలిగించేపనులు చేయకపోతే స్థిమితంగా జీవించవచ్చునని నచ్చ చెప్పాడు. శస్త్ర చికిత్స చేయించు కొనడానికే శ్యామనాథ్ నిర్ణయించు కొన్నాడు.

* * *

రామకుమార్ 17 సంవత్సరాల యువకుడు. క్షయరోగుల ఆసుపత్రికి అతడు రావడానికి యిది రెండో సారి, ఒక సంవత్సరానికి ముందు ఆరోగంతోనే అతడు ఆ ఆసుపత్రిలో చికిత్స పొంది వెళ్లాడు. సంఘ సేవకునితో సంభాషిస్తూ తాను ఆసుపత్రినుంచి విడుదల చెయబడ తర్వాత విశ్రాంతి మాట తలపెట్ట కుండా చదువు కొనడం వల్ల, కుటుంబం కోసంకూడా కష్టపడడంవల్ల, హాఆటలలో తరుచు పాల్గొనడంవల్ల తిరిగి యీ స్థితిఏర్పడ్డ దని చెప్పాడు. తనకు ఏది చెయ్యాలో, ఏది చెయ్యరాదో ఎవరూ చెప్పలేదన్నాడు

ఆసుపత్రి సిబ్బందిలో సంఘసేవకుడు లేడు, ఉంటే ముందు తీసుకోవలసిన జాగ్రతలను గురించిచెప్పి వుండే వాడు. వ్యాధి ముదిరినస్థితిలో రామకుమార్ ఏడాదిలోపు గానే తిరిగి ఆసుపత్రికి వచ్చేఅవస్థ తప్పివుండేది.

---

# వితంతువుల దుర్గతి

—శ్రీమతి నీరా కార్వే

"వితంతువులు ఎదుర్కొనవలసిన అవమానకరమైన పరిస్థితులనుగురించి మీరు ఎప్పుడైనా యోచించారా? వారుకూడా మానవులే. వారికికూడా యితరులవలెనే అన్ని బాధలూవుంటాయి."

నడివయస్సులోవున్న ఒక మహిళ కొందరు మిత్రుల సమావేశంలో అంటున్న మాట యిది. మహారాష్ట్రుల పద్ధతిని ఒక ఎఱ్ఱచీర కట్టుకొని వుందామె. బోడిగా వున్న ఆమె తలపై ముసుగువుంది. ఆమె ప్రసంగిస్తూ వుందేగాని ఎవరూ ఆమెవైపు చూడడంలేదు. తమలో తాము కబుర్లు చెప్పుకొంటూనేవున్నారు. ఆమె తమకు ఏదో చెబుతూవుందని వారు గమనించనేలేదు. అక్కడ ఆమె ఉన్నట్లే వారికి తోచనట్లుంది. ఆమె కొంచెం రిచ్చ పడ్డది. తాను అవమానించబడ్డట్టుగాకూడా అభిప్రాయ పడ్డది. అయితేనేమి తాను పూనుకున్న కృషి ఆమెకు జ్ఞాపకానికి వచ్చింది. మనస్సు చిక్కబట్టుకొని, తాను చెప్పదలచినదంతా చెప్పింది.

ఇది యాభైఏళ్ళ క్రితం ఖాండ్వాలోని ఒక ఈనాం దారుభవనంలో జరిగింది. ప్రొఫెసర్ కార్వే స్థాపించిన 'హిందూ వితంతు శరణాలయం' కోసం పనిచేస్తున్న శ్రీమతి పార్వతీబాయ్ అఠవాలే జీవితంలో కలిగిన తొలి అనుభవమది. ఆరోజులలో వితంతువులు యిల్లు కదిలి బయటకు వెళ్ళరాదు. వారు కనిపిస్తేనే అశుభంగా భావించబడేది. వారికి ఆర్థిక స్వాతంత్ర్యంలేదు. బంధువుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండవలసివచ్చేది. నిత్యం దూషణను, నిందను, అవమానాలను భరిస్తూ బానిసల్లా పనిచెయ్యవలసివచ్చేది. ఈ అన్యాయాన్ని చక్కబరచడానికి వితంతువైన పార్వతీబాయ్ తానే పూనుకొంది.

అనభిలషణీయమైన ఈ సంఘటన మాట ఎలావున్నా, సమావేశాన్ని ఏర్పాటు చేసినందుకు ఆమె ఈనాందారును అభినందించింది. అంతకుముందే తను ఆశ్రమం లక్ష్యాలను వివరించే నిమిత్తం చిన్న చిన్న సమావేశాలను ఏర్పాటుచెయ్యవలసిందని ఆమె కొందరు ప్రజలను కోరింది. అయితే వారు ఆమె మాటలను అంతగా పాటించలేదు. పైగా వితంతువు ఉపన్యసించడానికి రావడం వారికి వేళాకోళంగా కనిపించింది. కొలది మంది మిత్రుల సమావేశంలోనే ప్రసంగించే అవకాశమైనా, యిది ఆమెకు చాలా ఉపయోగకరంగా పరిణమించింది.

ఒకానొక సంఘటన జరిగివుండకపోతే ప్రొఫెసర్ డి. కె కార్వే స్థాపించిన ఆశ్రమం హాస్టల్‌లోనే మేట్రన్‌గా వుండిపోయేది. ప్రొఫెసర్ కార్వే తాను నెలకొల్పిన హింగ్నే సంస్థపరంగా పైనపెట్టుకొన్న బహుళ బాధ్యతలను నెరవేర్చగలగడంకోసం తరుచుగా విరాళాలను సేకరించవలసివచ్చేది. ఒకసారి విరాళాల సేకరణకు ఆయన ఎద్దుబండిపై ప్రయాణంచేస్తున్న సమయంలో మిట్టపల్లాలతో నిండిన ఆ రోడ్డుపై గతుకులకు బండి బోల్తాకొట్టింది. అన్న - అంతా డాక్టర్ కార్వేను అభిమానంతో పిలుచుకొనేపేరు అదే - తీవ్రంగా గాయపడ్డారు. తనవంటి అభాగినులకోసం ఆయన ఎంతటి ప్రమాదాల నెదుర్కొనడానికి సిద్ధపడుతున్నదీ గ్రహించి, పార్వతీబాయ్ ఎంతో బాధపడ్డది "విరాళాలకోసం అన్నను ప్రయాణాలు చెయ్యనీయడం ప్రమాదకరం. ఇటువంటిదే మరొక ప్రమాదంలో ఆయన చిక్కుకుంటే ప్రాణానికే మోసం సంభవించవచ్చు. అటువంటిది జరగరాదు. పోనీ నేనే ఎందుకు ప్రయత్నించరాదు?" అని ఆమె తలపోసింది.

అన్నకు తన నిర్ణయాన్ని తెలియజేసింది. ఖాండ్వాకు వెళ్ళడానికి సిద్ధపడింది. ఆమె ప్రయాణం పెట్టుకొన్న నాటిరాత్రి వున్న ఒక్క కొడుకు - నానాకు జ్వరంగా వుంది. అతడు ఏవో స్పృహ తెలియని మాటలు అంటున్నాడు. వెళ్ళనా మాననా అని యోచించింది. కుమారుని ఆరోగ్యంకంటె కూడా విధ్యుక్తధర్మమే ముఖ్యమనుకొంది. తన సహచరులకు బిడ్డను అప్ప

గించి, ఇనాందారు యింట సమకూడిన 13 రూపాయల తోను ఖాండ్వాకు బయలుదేరింది.

పార్వతీబాయ్ 1870 లో రత్నగిరి జిల్లాలోని దేవరుఖ్ గ్రామంలో జన్మించింది. ఆమెకు సవతి చెల్లెళ్ళు, తమ్ముళ్ళు పదిమంది వున్నారు. స్వంత యిల్లు, కొంత పొలం వున్నాయి. ఇవిగాక ఆమె తండ్రి బాలకృష్ణరావు జోషికి చిన్న వడ్డీ వ్యాపారంకూడా వుంది. ఇన్ని వున్నప్పటికీ రాబడిచాలక కుటుంబం పరిస్థితి క్షీణించసాగింది. తల్లి [illegible] కష్టపడి పనిచెయ్యవలసివచ్చేది. పార్వతీబాయ్‌కి పదవఏటనే పెళ్ళిచేశారు. ఆమె భర్త శ్రీ మహాదేవరావు ఆఠవాలేకు గోవాకస్టమ్స్ ఆఫీసులో నెలకు 15 రూపాయల జీతం. ఈ దంపతులకు పిల్లలు పుట్టారుగాని ఒక్క కుమారుడు నారాయణ్ మాత్రమే మిగిలాడు.

భర్త ఉద్యోగం గోవానుంచి మరొకచోటుకు ట్రాన్స్‌ఫర్ చెయ్యబడింది. దీనితో జీవిత పరిస్థితి కొంత మెరుగనిపించిందికాని కొత్త వాతావరణం ఆయనకు సరిపడలేదు. జబ్బుచేసింది. పాపం, 20 వ ఏటనే పార్వతీబాయ్‌కి వైధవ్యదుఃఖం కలిగింది. ఆమెకు అప్పటి ఆచారం ప్రకారం కేశఖండన జరిపించవలసి వచ్చింది. ప్రతీనెలా ఈయాతన ఆమెకు తప్పేదికాదు. తల్లిదండ్రులు ఆమె అవస్థచూసి కుమిలిపోయేవారు.

ఆమె అక్క బాయీను ప్రొఫెసర్ కార్వే పెళ్ళి చేసుకోకపోయివుంటే జీవితం నిరాశానిరుత్సాహాల తోనే గడిచిపోయేది. బాయీ వచ్చి వీరినందరను తమతోపాటు పూనాలో వుండమని కోరింది. కాని వారు వెళ్ళలేదు. పార్వతీబాయ్ తల్లివలెనే కొంచెం పూర్వాచార పరాయణురాలు. పార్వతీబాయ్ మిరజ్‌లోని ఒక మరది యింటికి వెళ్ళివుండాలనుకొంది. అయితే ఆ తర్వాత తన కుమారుని చదువుకోసం పూనాకు పంపడానికే నిశ్చయించుకొంది.

ఆరేళ్ళయిన తర్వాత ఒకనాడు ప్రొఫెసర్ కార్వే వితంతువులకోసం ఒక ఆశ్రమాన్ని స్థాపించాలన్న తన అభిప్రాయాన్ని పార్వతీబాయ్‌కి వివరించాడు. వితంతువులకు చదువు చెప్పించి, వారికి వారే కుటుంబాన్ని పోషించుకొనడానికి తగిన అవకాశాలు కల్పించాలనే ఆయన అభిప్రాయపడ్డాడు. ఆశ్రమ నిర్వహణలో తాను సాయపడదలచుకొన్నదీ లేనిదీ ఆలోచించి, చెప్పవలసిందని ఆయన కోరాడు. తనకు ఆయన చెప్పినది సరిగా అర్థం కాలేదనీ, అయితే హాస్టల్‌లో వంటపని చేసి పెడతాననీ ఆమె అంది. అంతకంటె ప్రయోజనకరమైన పనినే ఆమె చెయ్యగలదని అన్న గ్రహించాడు.

ఉపాధ్యాయురాలి సర్టిఫికెట్ సంపాదించుకొనడానికి వీలుగా ఆమెను 'హోం తరగతి'లో చేరవలసిందన్నాడు. పార్వతీబాయ్ 26 వ ఏట ఏ.బి.సి.డీ.లనుంచి ప్రారంభించి, కొన్ని సంవత్సరాలతో శిక్షణ పూర్తిచేసింది.

అప్పటికి ఆశ్రమం నడుస్తూవుంది. పార్వతీబాయ్ అన్నతో వేర్వేరు సాంఘిక సమస్యలను గురించి, ఆచారాలను గురించి చర్చిస్తు ఆయన అభిప్రాయాలను తెలుసుకొనేది. వితంతువులు స్వయంగా తమకు తామై పోషించుకొనడానికి చదువు అవసరమని గ్రహించింది. చివరకు 1942 లో వితంతువులకోసమే తన జీవితాన్ని పూర్తిగా అంకితం చెయ్యడానికి నిర్ణయించుకొని, ఆశ్రమంలో కార్యకర్తగా చేరింది. అప్పట్లో ఆశ్రమం ఒకపాకలో వుండేది. మొత్తం 18 మంది వుండేవారు. అన్న, మరొక ఉపాధ్యాయుడు విద్యార్థులకు బోధన చెయ్యగా పార్వతీబాయ్ వారి వసతి, భోజన సదుపాయాలను చూసేది. పనిచేసేవారి సంఖ్య తక్కువకావడం వల్ల ఆమె తానే సూపరింటెండెంటుగా, నర్సుగా, అటెండెంటుగా పనిచేసేది. ఆ తర్వాత ఆశ్రమంలో మరి కొందరు కార్యకర్తలు చేరడంతో పార్వతీబాయ్ విరాళాల వసూలుకు పంపబడింది. ఇరవై సంవత్సరాలపాటు అనేక చిక్కులను ఎదుర్కొంటూ, సుదీర్ఘ ప్రయాణాలు చేసి, ఆమె సుమారు లక్షరూపాయలు ప్రోగుచేసింది డబ్బుకంటె ఎక్కువ ముఖ్యమైన కార్యాన్నికూడా ఆమె సాధించింది. వితంతువులు చదువుకొనడం విషయంలో సంఘం వైఖరిలో మార్పుగానవచ్చింది. ఆమె కృషిని, ఆమె నడవడిని గమనించినవారు సక్రమమైన విద్య స్త్రీలను పాడుచెయ్యజాలదనే అభిప్రాయం చాలమందికి కలిగేది. ఈవిధంగా యువతుల విద్యాభ్యాసంపట్ల సుముఖ భావం ఏర్పడసాగింది.

సుదీర్ఘ ప్రయాణాలలో కలిగిన అనుభవాలనుబట్టి ఆమె శిరోజాలను పెంచుకొనడానికి నిర్ణయించుకొంది. ఆమె తన నిర్ణయాన్ని ఆచరణలో పెట్టినప్పుడు తీవ్ర విమర్శను ఎదుర్కొనవలసివచ్చింది.

# వితంతువుల దుర్గతి

మహారాష్ట్రం దాటి ప్రయాణాలుచేసినపుడు ఇంగ్లీష్ భాష రాకపోవడం ఆమెకు చిక్కుగా తోచింది. 40 వ ఏడులోవున్నా ఇంగ్లీష్ నేర్చుకుంటే బాగుంటుందనుకొంది. డాక్టర్ కార్వే ఆమెను కాన్వెంట్‌కు పంపించారు. అయితే అక్కడి ఉపాధ్యాయులు ఆమెను అంతగా లెక్ఖ చెయ్యకపోవడంతో ఆ ప్రయత్నం కొనసాగలేదు.

ఆమెను విదేశాలకు పంపిస్తే అక్కడ ఇంగ్లీష్ నేర్చుకొనడానికీ, పాశ్చాత్య రాజ్యాలలో మహిళా సంస్థలు ఏవిధంగా పనిచేస్తున్నదీ తెలుసుకొనడానికీ అవకాశం వుంటుందని అన్న భావించారు. ఈ వుద్దేశంతోనే పార్వతీబాయ్‌ని ఆయన 1917 లో అమెరికాకు పంపారు. తన బ్రతుకుతెరువుకు అక్కడ డబ్బు సంపాదించుకొంటూ వీలైతే ఆశ్రమానికి కొంత ద్రవ్య సహాయం సమకూర్చుకోవడమే లక్ష్యంగా ఆమె వెళ్ళింది.

ముందు కాలిఫోర్నియాలోని బెర్క్లీలో వై. డబ్ల్యు. సి. ఏ. హాస్టల్‌లో పనిచేసింది. ఎన్నో కష్టాలనెదుర్కొంది. పెద్ద కుటుంబాలలో ఇంటిచాకిరీ అంతా చేసేది. ఆసుపత్రిలోకూడా పనిచేసింది. ఎన్ని చేసినా ఆమె వచ్చిన లక్ష్యం నెరవేరలేదు.

ఒకసారి ఆమెను ఒక భారతీయ యువకుడు కలుసుకొని, ఇళ్ళలో చాకిరీ చెయ్యడం తన పేరు ప్రతిష్ఠలకు తగిన పనికాదన్నాడు. కావాలంటే ప్రయాణపు ఖర్చులను భరించి, స్వదేశానికి వెళ్ళేఏర్పాటు చేస్తానన్నాడు.

అయితే ఆమె వాషింగ్టన్‌లో జరిగిన ఒక కార్మిక సంక్షేమ సభకు స్త్రీ కార్మికుల ప్రతినిధిగా హాజరయ్యే అవకాశం కలిగింది. అక్కడ స్త్రీ కార్మికుల నాయకురాల్ని కలుసుకొంది. ఆమె పార్వతీబాయ్‌కి వ్యాప్తి చూపి, తన యింటిలోనే వుండే ఏర్పాటుచేసింది. ఒక ద్విభాషి సహాయంతో ఆమె కొన్నిచోట్ల ఉపన్యాసాలిచ్చింది. 1920 లో ఇండియాకు తిరిగిరావడానికిముందు అమెరికన్ ప్రజలనుంచి కొంత ద్రవ్యాన్ని, ఆశ్రమానికి కానుకగా ఒక కారును గొనివచ్చింది.

తన పనినుంచి విరమించుకొన్న తర్వాతకూడా ఆమె కృషి చేస్తూనేవుంది. ఆమె దాంపత్య జీవితం అనుభవించినకాలం స్వల్పమే అయినప్పటికీ ఆమె కుమారుడు మహారాష్ట్రానికి మణిపూసగా వెలుగొందాడు. ఆయన కూడా ఆశ్రమంలో పనిచేశాడు. పూనాలోని ఎస్. ఎన్. డి. టి. కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశాడు. ఉద్యోగం నుంచి విశ్రాంతి తీసుకొన్న పిదప ఒక లేబరేటరీ ఏర్పాటుచేసుకొని వైజ్ఞానిక యంత్రోపకరణాలను తయారుచేసేవాడు. తన పరిశ్రమలో వచ్చిన ఆదాయం నుంచి ప్రొఫెసర్ అఠవాలే హింగ్నె సంస్థకు లక్ష రూపాయల విరాళమిచ్చాడు.

పార్వతీబాయ్ 1955 అక్టోబర్‌నెలలో తన 85 వ ఏట పరమపదించింది. ఆమె మునిమనుమల్నికూడా చూడగలిగింది. హింగ్నెలోని ట్రెయినింగ్ కాలేజీకి ఆమె పేరే పెట్టారు. హింగ్నె స్త్రీ శిక్షణ సంస్థ వజ్రోత్సవం ఈ సంవత్సరం జరుగుతున్న సందర్భంలో ఆ ట్రెయినింగ్ కాలేజీకి ప్రత్యేకంగా భవనం నిర్మించబడుతుంది.



# అండమాన్ దీవులలో

## సంఘ సంక్షేమ కృషి

శ్రీ నిర్మల ఎస్. పండర్కార్

పత్రికలలో ఎడనెడ అండమాన్. నికోబార్ దీవులను గురించి ఏవో వ్యాసాలు పడుతూనేవున్నా యిప్పటికీ ఆ దీవులలోని ప్రజలలో అజ్ఞత, మూర్ఖత పూర్తిగా తొలగిపోలేదు. చిరకాలంగా ద్వీపాంతరవాస శిక్షవిధించబడిన నేరస్థులకు అదినెలవుగా వుంటున్నది. ఆ నేరస్థుల సంతతివారే అక్కడి ప్రజలు. వారిలో కొందరికి శాంతి భద్రతలతో ప్రమేయంలేక శాసన ధిక్కారానికే అలవాటు పడ్డ అజ్ఞులై వున్నారు.

ఇటీవలనే ప్రభుత్వం తూర్పు బెంగాల్ నిర్వాసులను దేశంలోని యితర ప్రాంతాల వారిని అక్కడ భూమి యిచ్చి, డబ్బుయిచ్చి, వ్యవసాయాది వృత్తులలో స్థిర పరచి పునరావాస కల్పనకు యత్నిస్తున్నది. కలకత్తాకు 900 మైళ్ళదూరంలో వున్న అండమాన్ దీవిని చేరుకోవాలంటే నాలుగురోజులు స్టీమర్ ప్రయాణం చెయ్యాలి. మూడేసి వారాలకొకసారి "ఎస్. ఎస్. మహారాజ" అనే నౌకద్వారానే అక్కడికి ప్రజలరాకపోకలు, ఉత్తరాలు. ఆహారధాన్యాలు యితర వస్తుసంభారాలు అందుబాటు జరుగుతూ వుంటాయి. స్టీమర్‌నుంచి పోర్ట్‌బ్లెయిర్ పట్టణాన్ని నేను తొలిసారిగా డెక్‌మీద నిలబడి చూడగానే ఒక రెండంతస్తుల మేడ కనుపించింది. స్టీమర్ రేవుకు చేరగానే అనేకమంది ఉత్సాహంతో అక్కడకు వచ్చి వున్నారు.

క్రిందకు దిగాను. ఆశ్చర్యం ఆ భవనంలో క్రింది హాలులో అన్నపూర్ణ కెఫిటీరియా కనిపించింది. అయితే యిక్కడ ఈ మహిళలు సంక్షేమకృషిని కొనసాగిస్తూనే వున్నారనుకోడానికి యిదే తొలి తార్కాణంగా కనిపించింది.

ఈ దీవులు బహు చిన్నవి. ఇక్కడ అఘోరి జనులు అడవులలోనే నివసిస్తూ వుంటారు. నాగరికతకు వారికి ఏమీ సంబంధంలేదు. వీరుఅడవిజాతివారు కావడంవల్లను అడవులు ఎక్కువగా వుండడంవల్లను దీవిలోని భూభాగంలో నూరింట 80 వంతుల ప్రాంతంలోకి మనం వెళ్ళడమే అసాధ్యం. ఎవరైనా కనబడితే తమకు ఏమి అపకారం చేస్తారన్న భయంవల్లనేమో ఈ ఆటవికజాతుల వారు వచ్చినవారిని. చంపుతారు. వీరిని మచ్చిక చేసుకోవడం ఒక్క పోలీసుశాఖకే సాధ్యపడింది. అప్పుడప్పుడు వీరు ఆ దీవులకు పడవలలో వెళ్ళి వండిన ఆహారపదార్థాలున్న పాత్రలను ఒడ్డునపెట్టి తిరిగి పడవలలో సముద్రంలోకి దూరంగాపోయి ఆ అటవికులు ఆ పాత్రలను గొనిపోవడాన్ని చూస్తూవుంటారు. అయితేవారినిమచ్చిక చేసుకోడానికి చేసిన ఈ ప్రయత్నం అంతగాఫలించలేదు.

ద్వీపాంతరవాస శిక్ష విధించబడి, యిక్కడకు పంపబడ్డనేరస్థుల సంతతివారే పోర్ట్‌బ్లెయిర్, మాయాబందర్ లాంగ్‌ఐలెండ్‌లలోని సెటిల్మెంట్లు. ప్రజలలో అధిక సంఖ్యాకులుగా వున్నారు. వీరిలో చాలామంది తోటలు వేసుకొన్నారు. సంపన్నులైనారు. కొందరు బాగా చదువుకొన్నారు. ఈ సెటిల్మెంట్లు అండమాన్ దీవి మధ్య భాగంలోను లాంగ్ ఐలెండ్‌లోను అభివృద్ధి ప్రాజెక్టుల నిర్వహణలో నిపుణులైన కార్మికులుగాను. నిపుణులుకాని కార్మికులుగాను. వ్యవసాయ వృత్తిలోను, చదువు కొన్న వారు ప్రభుత్వోద్యోగాలలోను మగ్నులై జీవిస్తున్నారు. వీరికితోడు దక్షిణ భారతదేశంనుంచి, బెంగాల్ నుంచి నిర్వాసులు. కార్మికులు వచ్చి స్థిరపడ్డారు. ముఖ్యంగా వీరి కోసమే కొంత సంఘసంక్షేమ కృషి జరుగుతూవుంది.

స్థానిక కార్మికులలో అధిక సంఖ్యాకులు అటవీశాఖలోనే పనిచేస్తున్నారు. వీరిలో చాలా మందికి రాబడి తక్కువ చదువు సంస్కృతి యించుమించుగా పూజ్యం. కనకనే వీరికి సంక్షేమకృషి ప్రయోజనాలు కొన్ని సమకూర్చడం అవసరమౌతున్నది.

హాడ్డోలోని రంపపుమిల్లులో 1200 మంది కార్మికులు పని చేస్తున్నారు. అంగవైకల్యం పొందిన కార్మికులకుగాని. వృద్ధులై పోయిన కార్మికులకుగాని ఎట్టిసౌకర్యాలు

లేనందున 1953 లో అండమాన్ మైనర్ ఫారెస్ట్ ఇండస్ట్రీస్ సొసైటీ ఏర్పాటు చెయ్యబడింది. వృద్ధులు, వికలాంగులు అయిన కార్మికులకు తోడ్పడి వారు చెయ్యగల యితర వృత్తులలో తిరిగి పనిపాటలు కల్పించడమే ఈ సంస్థ లక్ష్యం. బుట్టల అల్లకం, శంఖాలు పాలిష్ చెయ్యడం వేముపని మున్నగునవి వీరు చేస్తూవుంటారు. వీటిని స్థానికంగాను, యితర ప్రాంతాలలోను అమ్ముతూ ఉంటారు. కేంద్ర సంక్షేమ సంస్థ యిక్కడ అభివృద్ధి కార్యక్రమాలకు 1955-56 సంవత్సరానికి 3,500 రూపాయలు గ్రాంటు యిచ్చిన సంగతిని పేర్కొనడం అప్రస్తుతం కానేరదు. గవర్నమెంటు పాఠశాల సెటిల్మెంటుకు దూరంగా వుండడంవల్ల స్థానిక బాల బాలికలకు ఒక పాఠశాల ఏర్పాటు చెయ్యడం అవసరమైంది. అండమాన్ మైనర్ ఫారెస్ట్ ఇండస్ట్రీస్ సొసైటీయే 1953 ఏప్రిల్ మొదటి తేదీని తమ కార్మిక సంక్షేమనిధి నుంచి కొంత ద్రవ్యం తీసుకొని పాఠశాల ఏర్పాట్లు చేసింది. ఇతరులు కూడా కొంతవరకు విరాళాలు యిచ్చారు. 1955 లో స్థానిక ప్రభుత్వం 500 రూపాయల గ్రాంటు యిచ్చింది.

మిల్లు కార్మికుల క్లబ్బులోని ఒక హాలులోనే ఈ పాఠశాల నిర్వహించబడుతూవుంది. త్వరలోనే తగిన చోటుకు మార్చడానికి స్కూలు అధికారులు యోచిస్తున్నారు. హెడ్ మాస్టర్ సహా నలుగురు ఉపాధ్యాయులున్నారు. నాలుగవ తరగతివరకు మాత్రమే ప్రస్తుతం చదువు చెప్పబడుతూవుంది. పిల్లలనుంచి నెలకు నాలుగణాల ఫీజు తీసుకొంటారు. పలకలు, పుస్తకాలు ఉచితంగానే యిస్తారు. అయితే రాబడి తక్కువ. ఖర్చులు ఎక్కువ కావడంవల్ల అధికారులు చిక్కులనే ఎదుర్కొంటున్నారు. మొత్తంమీద 90 మంది పిల్లలున్నారు.

విద్యాబోధన హిందీలో జరుగుతుంది. అయినా తెలుగు, తమిళం, బెంగాలీ భాషలలో కూడా పాఠాలు చెబుతారు. మూడు నాలుగు తరగతుల విద్యార్థులకు బుట్టల అల్లిక, వస్త్రపు పనికూడా నేర్పుతారు. తమ చిన్ని చేతులతో తయారుచేసిన బల్లలనే ఉపయోగించుకొనడం ఆ పిల్లలకు ఎంతో సంతోషం కలిగిస్తుంది. క్రింది తరగతుల విద్యార్థులకు పేపర్ వర్క్, డ్రాయింగ్ వేముప్పని కూడా నేర్పుతారు. "అండమాన్ కలప" బోధనాంశాలలో ఒకటిగా స్కూలు అధికారులు చేసిన నిర్ణయం నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. రకరకాల కలప ఉపయోగాలను గురించి పిల్లలకు పాఠాలతోపాటు చెబుతూ వుంటారు. విద్యార్థులలో చాలామంది మిల్లు కార్మికుల బిడ్డలే కనక, పెద్దవారైన పిదప వారుకూడా మిల్లులలోనే పని చెయ్యడానికి ఈ శిక్షణ అమూల్యంగా ఉపకరించగలదు.

పిల్లల ఆరోగ్యం విషయాలలో కూడా స్కూలు అధికారులు శ్రద్ధవహిస్తున్నారు. రోజూ ఉదయం పాఠాలు చెప్పడానికి ముందు శరీర వ్యాయామం చేయిస్తారు. విరామ కాలంలో డబ్బాపాలు, విటమిన్ బిళ్ళలు సరఫరా చెయ్యబడుతున్నాయి.

అండమాన్ మైనర్ ఫారెస్ట్ ఇండస్ట్రీస్ సొసైటీ అంత పెద్దదికాకున్నా అనేకకార్యక్రమాలను చేపట్టి ఉత్సాహంతో నిర్వహిస్తున్నది. [illegible] పని [illegible]కోసం 1954 ఆగస్టు మొదటితేదీని ఒక క్రెచి ఏర్పాటు చెయ్యబడింది. కేంద్రసంక్షేమసంస్థ దీనికి 1954-55లో మాచింగ్ గ్రాంటుగా 3,000 రూపాయలు, మాచింగ్ గ్రాంటుగాకుండా 1955-56కు 1500 రూపాయలు గ్రాంటుగా యిచ్చింది.

ఆ ప్రాంతంలో పనిపాటలు చేసుకొనే ఏ స్త్రీ అయినా తన బిడ్డను క్రెచిలో వదలవచ్చు. దీని ఉపయోగాన్ని గురించి ఆ స్త్రీలకు నచ్చచెప్పడానికి ఎంతో కష్టపడవలసివచ్చింది. ఇప్పుడు క్రెచిలో 12 లేక 13 మంది పిల్లలున్నారు. ఒక మేట్రను ఇద్దరు ఆయాలు ఉదయం ఏడుగంటలనుంచి మధ్యాహ్నం మూడు గంటల వరకు బిడ్డలను చూస్తారు.

[illegible], ఉడుపులిస్తారు. పాలు, విటమిన్ బిళ్లలు యిస్తారు. అన్నపూర్ణ డిపార్టుమెంటునుంచి 11-30కు భోజనం రాగానే బిడ్డలకు పెడతారు. మరీ చంటి బిడ్డలైతే [illegible] డబ్బాపాలు పడతారు. అప్పుడప్పుడు ఒక లేడీ డాక్టర్ వచ్చి పిల్లని చూస్తూవుంటుంది. ఆడుకోడానికి ఆటవస్తువులు, బొమ్మలు ఉన్నవున్నాయికాని మరీ చిన్న పిల్లలుకావడంవల్ల చదువుచెప్పేఏర్పాటు ఏదీ చెయ్యలేదు.

నాకు వున్న వ్యవధి తక్కువ కావడంవల్ల పోర్ట్ బ్లెయిర్ దాటి పరిసరాలవున్న యితర దీవులలో జరుగుతున్న సంఘసంక్షేమ కృషిని పరిశీలించే అవకాశం లేకపోయింది. ఇతరదీవులలో కూడా చిన్న ఎత్తున కృషి జరుగుతూవుందని తెలుసుకున్నాను. దక్షిణాదివారు, బెంగాలీలు, కరెన్లు (బర్మీస్) తరుచు సమావేశాలు జరుపుకొంటూవుంటారు. భాషలోను ఆచారాలలోనుగల భేదాలతో సంఘ సేవకు, సౌభ్రాతృత్వ వ్యాప్తికి ఎంత మాత్రం అవరోధాలు కాలేదని కూడా నేను గ్రహించాను.

---

# " మరువ



మనకు స్వాతంత్ర్యం సిద్ధించి తొమ్మిది సంవత్సరాలయింది. 1947 ఆగస్టు 15 వ తేదీ నాటికి పదేళ్ళ ప్రాయంగల బాలబాలికలు యిప్పుడు కాలేజీలలో చదువుతూ వుండవచ్చు. లేదా పొలాలలోనో, దుకాణాలలోనో, ఫ్యాక్టరీల లోనో పనిచేస్తూ తమ జీవనోపాధిని ఆర్జించు కొంటూ వుండవచ్చు. సంఘసంక్షేమకర్తలమైన మనం ఇండియా పట్ల మన చేతుల్లో పెరుగు తున్న బిడ్డల దృక్పథం, యువకుల దృక్పథం భిన్నంగా వుంటుందనే అంశాన్ని గమనించ వలసివున్నాము. జాతీయ స్వాతంత్ర్య సమర కాలంనాటి కష్టనిష్ఠూరాలుగాని, ఆ రోజులనాటి సంతోషంగాని వారి అనుభూతికి రాలేదు.

'దండి' సత్యాగ్రహంవల్లగాని, వ్యక్తి సత్యాగ్రహంవల్లగాని, 1942 నాటి ఉద్రిక్త పరిస్థితుల వల్లకాని కలిగే ఉద్వేగానుభూతితో నిమిత్తం లేని ప్రశాంత దృక్పథంవారిది. తమ కళ్ళ ఎదుట కానవస్తున్న నవభారత పురోగతిని ప్రథమ, ద్వితీయ పంచ వర్ష ప్రణాళికల దృష్ట్యానే వారు నిర్ణయించుకొంటారు. ఆ ప్రణాళికల ఫలితాలనేవారు గమనిస్తారు. వారికి విదేశీ పరిపాలనలోని కష్టనష్టాలు, తలవంపులువారు చవిచూసివుండ లేదు. పరాయి ప్రభుత్వం అంటే యేమో వారికి గ్రహించే అవకాశం లేక పోయింది.

స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్న ప్రతీ వార్షి కోత్సవంనాడు స్వాతంత్ర్య పోరాటపు రోజు లలో మనలను నడిపించిన నాయకుల ధైర్య స్థైర్యాలు, ఆనాటి వెన్నెలకాంతులు, నీలినీడలు జ్ఞప్తికివస్తాయి. వీటికన్నిటికి అగ్రస్థానంలో బాపూజీ సుస్మేరాననం గోచరిస్తుంది. పెక్కు సంవత్సరాలపాటు భారతనారీ లోకానికి ప్రాతి నిధ్యం వహించిన సరోజినీదేవి గంభీరమైన – ఉత్తేజకరమైన ఉపన్యాసాలు గుర్తుకువస్తాయి. కస్తూర్బా నిరాడంబరత్వం, ఆనీ బెసెంట్

# రాని మాట....”

హూందా తలచుకొంటాం. కాంగ్రెస్ జనకులనదగిన దాదాభాయ్ నౌరోజీ, లోకమాన్య తిలక్‌ల నుంచి, సరిహద్దు గాంధి, అసఫ్‌భాయ్, వాక్చాతురీ ధురీణుడైన బులాభాయ్ దేశాయ్, మోతీలాల్ నెహ్రూలు జ్ఞాపకానికివస్తారు. అమరజీవి శ్రీ సుభాష్ చంద్రబోస్‌ను ఆయన నాయకత్వం వహించిన ఆజాద్ హింద్‌ఫౌజ్‌ను, కర్నల్ లక్ష్మీసాహసికచర్యలను, యిప్పటికీ పంజాబ్ విస్మరించలేకున్న భగత్‌సింగ్ విషాదగాథను స్మరించుకొంటాం.

మన నాయకీనాయకుల గురించి, తమ సామాన్య జీవితాలను మాతృదేశానికి అచంచల భక్తివిశ్వాసాలతో సేవా త్యాగాలుచేసి. పునీతం కావించుకొన్న కోటానుకోట్ల దేశభక్తులను గురించి ఎలుగెత్తి, సంస్మరించకుండా ఎలా వుండగలం ?

మన యువకతరంవారు వారిని గురించి మన ద్వారా వినవచ్చు. లేదా పుస్తకాలలో చదువుకొనవచ్చు. అప్పటికీ వారికిది మహోత్సాహం, ఆసక్తి కలిగించగల మహాద్భుత గాథే కాగలదు. అయితే స్వాతంత్ర్య సమరం నాటి మహాసంరంభంలో ఒక్కొక సంఘటన అశేషభారత ప్రజానీకం హృదయాలను ఏవిధంగా ఉద్రేకంతోను, ఉద్వేగంతోను నింపివేసేదో వారికి తెలియదు. ఈ తరంవారికి జైలుకు వెళ్ళవలసిన, ఆవశ్యకతనుగురించికూడా తెలియదు. వారివి ఎట్టి నిరాశలకు తావులేని మధురజీవితాలు. అయితే మనలో పిన్నలము, పెద్దలముకూడా ద్వితీయ మహాయోజనలలో ప్రవేశించనున్న సమయాన, బాల్యంనుంచి మనతో కూడానేవున్న జవాహర్‌లాల్ నాయకత్వాన ఆత్మగౌరవోద్దీపితమైన జీవితాలను గడుపుకోగల రహదారిలో పురోగమిస్తూ, సోషలిస్టు సంక్షేమ రాజ్యస్థాపనకు అచంచల దీక్షతో, త్యాగనిరతితో కృషిచెయ్యడానికే ప్రతిజ్ఞ చేద్దాం.

ఎంతో ప్రయాసపడిన మీదటనే మన సంక్షేమ రాజ్యం ఉదయించింది. చరిత్రార్ణవాన్ని మథించినపుడుగాని అమృతము లభించదుగదా! స్త్రీలు, బిడ్డలు, దుర్బలులూనేడు నవజీవన ప్రాంగణంలో నిలబడడానికి, మున్నెన్నడు కలలో కూడా కాననేరని మహదవకాశాలు, సౌకర్యాలు పొందడానికి, తమ స్వప్రయోజనాలను ఆశించకుండా, స్వీయ సౌఖ్యాన్ని వాంఛించకూడా సర్వవిధాల త్యాగం చెయ్యడమే కారణం. ఒక్కసారి మౌనంగా వారిని గురించి తలుచుకోవలసిన సమయమిది. ఒక్కసారి మనం హృదయపూర్వకంగా 'మీకివే మా నమోవాకాలు' అందాం. ఇది మరువరాని మాట...

---

—ఫ్రెడా బేడీ

# హిమాచలప్రదేశ్ లో పోలీసులచే విద్యాప్రదానం

సంఘపురోభివృద్ధి, సంఘసేవల కార్య క్రమాలు అధికార. అనధికార సంస్థలు నిర్వహిస్తున్నప్పటికీ, ఈ రంగాలలో శక్త్యానుసారం తాముకూడ సహాయము చేయవలసి ఉన్నదని హిమాచల ప్రదేశ్ పోలీసువారు గుర్తించారు. ఈ అభిప్రాయం నెరవేర్చుకొనుటకు రిజర్వులైనులలోనూ, పోలీసు స్టేషనులలోనూ. శిశువులకు వీలైనన్ని క్లబ్బులను నెలకొల్పుటకు నిశ్చయింపబడినది. ఈ ఆశయము నెరవేర్చుటకు ప్రస్తుతము 7-17 సంవత్సరముల వయసుగల శిశువులకు వినోదములు. శరీరవ్యాయామము సాంఘికవిద్య. విద్యాబోధ. మొదలగునవి పోలీసువారి స్వచ్ఛందసహాయము వలన జరుపుటయే ఈ క్లబ్బుల ప్రధానలక్ష్యము. బాలనేరస్థులు, పోలీసువారి పిల్లలు, పేదల బాలబాలికలు, షెడ్యూల్డ్ తరగతుల పిల్లలు, ఆట వికాసాలుండని చెందిన పిల్లలు వీరివిషయమై ప్రత్యేకముగు శ్రద్ధ తీసికొనబడుచున్నది. అన్నివారములకూ స్పష్టంగాచెందిన విభాగములు తమతమ విధులను ఈ క్లబ్బులకు ఫలవంతమయినదిగా అధికారులు ప్రోత్సహించుచున్నారు. క్లబ్బులలోని సాధన సామగ్రులదృష్ట్యా ఒక నిర్ణీత సంఖ్యలోనే పిల్లలను చేర్చుకొంటున్నారు.

ఇంతవరకు ఆ రాష్ట్రంలో ఇటువంటి శిశువుల క్లబ్బులు 20 నెలకొల్పబడ్డాయి. ఒక్కొక్క దానిలో 30 లగాయతు 40 మందివరకు ప్రవేశం కలదు. పెద్ద ఆటస్థలం ఉన్న పోలీసు కార్యాలయాల్లోనే ఈ క్లబ్బులు నిర్మిస్తారు. ఒక్కొక్క సభ్యుడు నెలకు రెండణాల చొప్పున సభ్యత్వ చందా చెల్లించాలి. ఈ క్లబ్బులలో వారికి లభించే అవకాశాలన్నీ తామే స్వయంగా సమకూర్చుతున్నామనే విశ్వాసం ఒక్కొక్క మెంబరు మనసులోను కల్గించాలనే, ఈ చందాలు వసూలుచేయడం జరుగుతుంది. ఇది పోను మిగతా ఆవసరధనము ప్రజల ఇచ్ఛిక చందాలనుండి, ప్రైవేట్ పోలీసు నిధులనుండి విరాళములు, అప్పులుగా సేకరించబడుతూంది. క్లబ్బులలో జరిగే వినోద ప్రదర్శనముల్లోనుండి వచ్చు ఆదాయములు కూడా ఈ క్లబ్బు నిర్వహణకు ఉపయోగిస్తున్నారు. అయాచితంగానే వీరికి ప్రజలనుండీ అన్నిసంస్థలనుండి భూరివిరాళములు లభిస్తున్నాయేగాని ఏ విధమైన ఒత్తిడి వల్లాకాదు అన్నది ప్రశంసించదగ్గ విషయము. క్రమంగా కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థనుండి కూడా తగిన విరాళము లభించగలదని ఆశించబడుతూంది.

ఇంటా బయటా శిక్షణకూ, వినోద వికాస కార్యకలాపాలకూ పనికివచ్చే సాధన సామగ్రిని సమకూర్చేందుకూ, కమ్యూనిటీ లిసెనింగ్ స్కీముద్వారా. రేడియో సెట్టులను సంపాదించుటకూ ప్రయత్నాలు జరుగుచున్నవి

సామాన్య విజ్ఞానవిదాన సాధన సంపత్తిని, అంటే, పుస్తకాలు, కరపత్రాలు, చిత్రపటాలు ప్రతీ క్లబ్బులోనూ సమకూరుస్తున్నారు.

సభ్యుల అభిరుచుల కనుగుణంగా అక్కడక్కడ ప్రత్యేకార్థం కనుసరణంగా ఆటలు, వ్యాయామ శిక్షణ, ప్రసంగములు, పద్యపఠనం, గేయసంగీతం. నాటక ప్రదర్శనము మొదలగు కార్యక్రమాలు కాక ఒక హాబీ సెంటరును నిర్మించుటకు ప్రయత్నించుచున్నారు. స్థానిక పోలీసు ఉద్యోగులే ఈ క్లబ్బులకు అధ్యక్షులుగా నియమించబడుతూంటారు. చదువుకున్న హెడ్ కానిస్టేబుల్ జమాఖర్చులు చూడాలి. కార్యనిర్వాహక వర్గమునూ కార్యదర్శినీ క్లబ్బు సభ్యులే ఎన్నుకుంటారు.

శైశవంలోనే బరువు బాధ్యతలను వహించుటకూ కార్య నిర్వహణ దక్షతలో అనుభవం సంపాదించుటకూ ఈ విధానం తోడ్పడుతుంది. ప్రతి క్లబ్బు విధానములతో సభ్యుల హాజరుపట్టీ తయారుచేయాలి. జమాఖర్చుల చిట్టా ఉండాలి. ప్రతి సభ్యుడూ వ్యక్తిగతంగా ఎంతవరకు అభివృద్ధిచెందినది తెలిపేపట్టికలు తయారుచేయాలి. క్లబ్బుకు సంబంధించిన వస్తుసామగ్రులకు జాబితాలు ఉండాలి. ప్రతి సమావేశంలోనూ చర్చించిన తీర్మానాలు వ్రాయుటకొక మినిట్సు బుక్కును ఉంచాలి.

ఇటీవల నహాన్ నగరంలో జరపబడిన హిమాచల ప్రదేశ్ పోలీసు స్పోర్ట్సు అథ్లెటిక్ మీట్ లో పిల్లలకు కూడా అవకాశము కల్పించబడినది. రాష్ట్రంలోని వివిధ క్లబ్బులనుండి సలభై మంది పిల్లలు అందులో పాల్గొన్నారు. అందుకు అయినఖర్చులు పూర్తిగా ఆయా క్లబ్బులే భరించాయి.

ఈ పథకం ప్రముఖుల ఆదరణను ఎక్కువగాపొందినది. ఇంతవరకూ ఏర్పడిన క్లబ్బులలోని సభ్యులలో మహోత్సాహము రేకెత్తినట్లు గమనింపబడినది.

—ఆనంద్ సరూప్‌గుప్త.



ఉత్తర ప్రదేశ్‌లో ఒక గ్రామంలో కల్యాణ పరియోజనా క్షేత్రంలో మహిళలు విద్యాభ్యాసము చేయుటకు ఎంతో కాంక్షిస్తూ ఉన్నారు. ఇందు గ్రామీణ యువతులు అత్యంత దీక్షతోనూ, సంతోషంతోనూ, పాఠాలు చదువుతున్నారు.

దేశస్వాతంత్ర్యం లభించిన తరువాత రాష్ట్ర సౌభాగ్యానికిగాను సమాజ సేవ చేయాలనే కాంక్ష ప్రబలం అయింది. పూర్వం సమాజ సేవకు సౌలభ్యాలు లేవు. ఇప్పుడు ప్రభుత్వంలోనూ ప్రజలలోనూ చైతన్యం కలిగి సౌభాగ్యమునకు కావలసిన సేవలు తలపెట్టబడినవి.

సమాజ కల్యాణ సేవకు కావలసిన ధన సహాయమును కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ నుండియు, రాష్ట్ర ప్రభుత్వాలనుండియు, స్వచ్ఛంద వితరణలవల్లనూ సంపాదించి సంఘ సేవా కార్యకలాపాలు ఉత్తర ప్రదేశ్‌లో అనేకచోట్ల చాల కేంద్రములు స్థాపించబడినవి. స్వచ్ఛంద సేవా సమాజములు లేని చోట్ల సేవాసంస్థలను నెలకొల్పుటకు ప్రోత్సాహం జరుగుతూ ఉన్నది.

దేశంలో సాంఘిక సంక్షేమ సేవా సమాజములు ఇంతవరకు స్వచ్ఛందంగా జరిపే సేవలనూ, రాష్ట్ర ప్రభుత్వము జరిపే ప్రజాహిత కార్యములనూ, కేంద్ర సంక్షేమ సంస్థ తలపెట్టిన కార్యకలాపాలనూ సమన్వయపరుస్తూ, స్వయం సహాయక ప్రణాళిక ఫలప్రదం అయ్యేలాగు ఈ సంక్షేమ కార్యక్రమం ఉత్తర ప్రదేశ్‌లో చక్కగా నిర్వహింపబడుతూ ఉంది.

# ANDHRA MAHILA SABHA
## NURSING HOME

REPORT FOR JULY 1956

### MATERNITY WARD

| | |
|---|---|
| No. of Patients admitted for Deliveries | 339 |
| ,, ,, do Deliveries | 126 |
| ,, ,, Surgical cases treated | 4 |
| ,, ,, Medical cases treated | 19 |
| ,, ,, Gyneac and Abortions | 22 |
| ,, ,, Ante-natal | 33 |
| ,, ,, Post Natal | 7 |
| ,, ,, normal deliveries | 118 |
| ,, ,, abnormal deliveries | 8 |
| ,, ,, babies | 128 |
| Grand total | 339 |

### IN-PATIENT MATERNITY

| | |
|---|---|
| No. of patients Delivered | 126 |
| ,, ,, normal Deliveries | 118 |
| ,, ,, abnormal Deliveries: forceps 7, Breach 1 = 8 | 8 |
| Total | 126 |

### OUT-PATIENT DEPARTMENT

| | |
|---|---|
| No. of Surgical cases | 86 |
| ,, ,, Medical cases | 823 |
| ,, ,, Ante-natal cases | 222 |
| ,, ,, Post-natal cases | 114 |
| ,, ,, Gyneacological cases | 100 |
| ,, ,, E.E.N.T. cases | 50 |
| Total No. of New patients | 1395 |
| Total No. of Old patients. | 1692 |
| Grand Total | 3087 |

NURSES' TRAINING CENTRE

Out of 60 candidates undergoing the auxiliary training 30 will be completing their course in July 1956. 30 candidates sponsored by the Central Social Welfare Board have been taken in this year and have started their training. The Andhra Government have promised to sponsor 30 more candidates.

Mrs. LAKSHMI PARVATHI
*Secretary and Convenor*
Mrs. A. C. KRISHNA RAO
*Administrative Secretary*

Dr. M. PAVANA BAI
*Medical Superintendent*



# అంతా ఆంధ్ర తారలే!

మద్రాస్ ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ 1955 సంవత్సరంలో తయారైన ఉత్తమ చిత్రాలను, ఉత్తమ నటీనటులను సంబంధించిన ఎన్నిక ఫలితాలను ప్రకటించింది. కొందరు జడ్జీలు ఈ ఎన్నిక జరిపారు. జడ్జీల సంఘానికి మద్రాసు పోలీసు కమిషనర్ శ్రీ పార్థసారథి అయ్యంగారు అధ్యక్షత వహించారు. ఇతర ప్రముఖులు మరి కొందరుకూడా ఉన్నారు.

ఇంతవరకు ఉత్తమ తమిళ తెలుగు చిత్రాలకు మాత్రమే బహుమతులిస్తున్న ఈ సంస్థ ఈ సంవత్సరం కన్నడ చిత్రాన్ని, మలయాళ చిత్రాన్ని దక్షిణ భారత దేశంలోనాక యితరత్రా తయారైన ఉత్తమ హిందీ చిత్రాన్ని, 1955 సంవత్సరానికి ఉత్తమ విదేశీ చిత్రాన్ని కూడా ఎన్నుకొన్నది.





తెలుగు '[illegible]'లో ఉత్తమ నటిగా ఎన్నుకొనబడిన తెలుగుతార శ్రీమతి అంజలీదేవినే తమిళ చిత్రం కణవనే కణ్కండ దైవంలో కూడ ఉత్తమ నటిగా ఎన్నుకొనబడినది. ఈ రెండింటిలోనూ, తెలుగులోనూ ఉత్తమ స్థాయిని, తన నటనా కౌశల్యాన్ని ప్రదర్శించి రెండు భాషలలోనూ ఉత్తమ నటిగా ఎన్నుకొనబడిన శ్రీమతి అంజలీదేవి తన ప్రతిభను నిరూపించుకొనగలుగుట మిక్కిలి ప్రశంసనీయము.







కన్నడ చిత్రంలో కూడా ఉత్తమ నటిగా ఆంధ్ర తారయే ఎన్నికఅగుట గమనించదగ్గ విషయం. 'ఆదర్శ సతి'లో ఆదర్శ సతిగా అత్యంత స్వాభావికంగా నటించి, వయస్సులో చిన్నదైనా పాత్ర పోషణలో అనుభవాన్ని ప్రదర్శించిన కుమారి జమున నటనా కౌశలము మిక్కిలి ప్రశంసార్హము.



కళా ప్రావీణ్యము భాషా విభేదములకు అతీతమని మనతారలు రుజువుచేశారు.



తెలుగులో ఉత్తమ చిత్రంగా బహుమతి పొందిన 'బంగారుపాప', ఉత్తమ చిత్ర నిర్మాణమునకు పేరెన్నిక గన్న వాహినీవారి నిర్మాణ చాతుర్యమును ఋజువుచేసినది. ఈ చిత్రానికి జీవనాడియైన కోటయ్య పాత్రకు జీవంపోసిన శ్రీ రంగారావు తెలుగు ఉత్తమ నటుడిగా ఎన్నికయై తన కీర్తిని ద్విగుణీకృతముచేసుకొన్నారు. నటునిగా అత్యంత స్వాభావికంగా ప్రదర్శించుటలో రంగారావు మేటి. భావప్రకటన ఆయన సొమ్ము.





ఉత్తమ శ్రేణికి చెందిన ముగ్గురు నటీనటులను 'ఆంధ్ర మహిళ' అభినందించుచున్నది.

# మినికాయ్ దీవి ప్రకృతి సౌందర్యం

—:o.—

అరేబియా సముద్రంలోని మినికాయ్ అనే దీవిలోని స్త్రీలు భారత భూభాగంలోని అనేక నాగరీక కుటుంబాల లోని స్త్రీలకంటె ఎక్కువ సౌకర్యాలు కలిగివున్నారు. మినికాయ్ దీవిని గురించి ఎక్కువ మందికి తెలియనే తెలియదు. ఈ దీవి పగడపు దీవులుగా ప్రపంచ ప్రఖ్యాతి చెందిన లక్ష దీవులకు దక్షిణపు కొసను వున్నది.

మినికాయ్ దీవి మలబార్ తీరానికి 200 మైళ్ళ దూరంలో వుంది. ఈదీవి కేప్ కామిరిన్ ఒకే అక్షాంశ రేఖమీద ఉన్నాయి. ఈ దీవి భారత యూనియన్ యొక్క నైరుతి కొసనుగల ద్వీపమని చెప్పబడుతున్నది.

మినికాయ్ దీవి అర్ధ చంద్రాకారంలో వున్నది. ఆదీవి విస్తీర్ణం మూడు చదరపు మైళ్ళు. ఈ దీవిలో 30 సంవత్సరాలనాటి దీపస్థంభం వున్నది. దాని ఎత్తు 150 అడుగులు. ఆ దీపస్థంభంపై అధికారం యీ సంవత్సరం ఏప్రిల్‌లో బ్రిటిషు ప్రభుత్వం నుంచి భారత ప్రభుత్వానికి సంక్రమించింది. ఈ దీపస్థంభం దక్షిణపు కొసనుంచి అరమైలు దూరంలో వున్నది.

మినికాయ్ దీవి మధ్య భాగంలో ఒక గ్రామంవున్నది. ఆ గ్రామంలో ఒక పంచాయితీ హాలు, ప్రభుత్వ ఆధ్వర్యం క్రింద గల ఒక ప్రైమరీ స్కూలు, ప్రభుత్వ ఆస్పత్రి, వైర్‌లెస్ రిసీవింగు స్టేషను వున్నాయి. పంచాయితీ భవనంపై త్రివర్ణ పతాకం ఎల్లవేళలా ఎగురవేయబడి వుంటుంది. ఈ దీవియొక్క జనాభా 4,000 లు. అందులో సుమారు వెయ్యిమంది పురుషులు గ్రామంలో వుండరు. వారు నావికులుగా పనిచేస్తున్నందున ఎల్లప్పుడు ఒకరేవు నుంచి మరొక రేవుకు వెడుతూ వుంటారు.

ఈనాడుకూడా ఆ దీవి ప్రజలకు డబ్బుతో నిమిత్తం లేదు. స్థానిక వ్యాపారమంతా వస్తు మార్పిడి విధానం ద్వారా జరుగుతుంది. తమ నిత్య జీవితావసరాలు, సాంఘిక అవసరాలు తీరితే వారికి చాలు. వారికి ఆస్తి పాస్తులమీద ఎక్కువ మక్కువ లేదు. వారి సంఘ జీవిత విధానం ఆశ్చర్యంగా వుంటుంది. ఆ దీవిలో పోలీసు వారు మచ్చుకైనా లేరు.

## సాంఘిక ఆచారాలు

ఆ దీవిలోని ప్రజలు ముస్లింలు. స్త్రీలు ఘోషా పద్ధతిని పాటించరు. అక్కడి స్త్రీలు సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యాలను కలిగివున్నారు. అక్కడ అమలులో వున్న వారసత్వపు పద్ధతి ప్రకారం తల్లికి సంపూర్ణాధికారాలున్నాయి. మలబారు జిల్లాలో మాదిరిగానే ఆస్తి సమిష్టి కుటుంబానికి చెంది వుంటుంది. అదే దీవిలో భూములన్నీ ప్రభుత్వానికి చెంది వున్నందున, ఇప్పు మాత్రం ప్రజల ఆస్తిగా పరిగణించబడుతున్నది. యీ పద్ధతికూడా యిటీవలే అమలులోకి వచ్చింది.

ఆ దీవిలో అమలులోవున్న శాసనం ప్రకారం పురుషునికి ఇంటిపైన ఎట్టి హక్కు లేదు. గృహాలు కుటుంబంలోని స్త్రీల పేరిట వుంటాయి. పురుష సభ్యులు పెళ్ళి ఆయేవరకు ఆఇంట్లో నివసించే హక్కు, పోషించబడే హక్కు కలిగి వున్నారు. పురుషుడు వివాహం కాగానే భార్య ఇంట్లో నివసిస్తాడు. అంతేగాక తన ఇంటి పేరు తీసివేసి భార్య ఇంటి పేరు పెట్టుకొంటాడు.

## భర్తను ఎన్నుకోవాలి

మినికాయ్ దీవిలో స్త్రీలదే పైచెయ్యి. బాల్య వివాహాలు అమలులో వున్నా, ప్రతి బాలికకు తన యిష్టమొచ్చిన వ్యక్తిని భర్తగా స్వీకరించే స్వేచ్ఛ వున్నది. అక్కడ పురుషులకంటే స్త్రీలలోనే ఎక్కువమంది అక్షరాస్యులున్నారు. ప్రభుత్వం అదే దీవిలో ప్రైమరీ స్కూలును నెలకొల్పడానికి పూర్వం, ఒక్కొక్క కుటుంబంలోని స్త్రీలే తమ పిల్లలకు చదువను, వ్రాయను నేర్పేవారు. క్రిందటి ఎన్నికలలో పురుషులకంటే రెండు రెట్లు స్త్రీలే ఓటింగులో పాల్గొన్నారు.

ఆ దీవియొక్క పౌర వ్యవహారాలలో కూడా స్త్రీలకు ముఖ్యమైన పాత్ర వున్నది. ఒక్కొక్క వార్డులోని స్త్రీలు ఆ వార్డు పెద్ద (ఆమెకూడా స్త్రీయే) యొక్క అధ్యక్షత క్రింద ప్రత్యేక క్లబ్బులలో సమావేశ మవుతూవుంటారు.

ఆ క్లబ్బులలోకి పురుషులకు ప్రవేశములేదు. ఆ సమావేశాలలో స్థానిక, గృహవిషయక, సాంఘిక,



ఆర్థిక విషయాలు చర్చిస్తారు. ఆ క్లబ్బులకు "వారు గీలు" అని పేరు. అక్కడ స్త్రీలు కొబ్బరి తాళ్ళను పేనుతూ చర్చలు సాగిస్తూవుంటారు. పురుషులు ఎన్నుకోబడిన గ్రామ పెద్ద అధ్యక్షత క్రింద సమావేశమై ఆ దీవికి సంబంధించిన పౌర, సాంఘిక విషయాలను చర్చిస్తారు. పురుషుల క్లబ్బులకు "అట్రీలు" అని పేరు. స్త్రీల క్లబ్బులలో పోటీ చేయబడే నిర్ణయాల యొక్క ప్రభావం పురుషుల క్లబ్బులలో జరిగే చర్చలపై ప్రసరిస్తుంది.

## కొబ్బరి పంట

మినికాయ్ దీవి ప్రకృతి సౌందర్యముతో వెల్లివిరుస్తున్నది. ఆ దీవిలో ఎక్కడ చూచినా కొబ్బరితోటలే. ఆ తోటలే ఆ దీవి ప్రధాన సంపద. చేపలు పట్టడం, కొబ్బరి పీచునుంచి వస్తువులు తయారు చేయడం అక్కడి ప్రజలకు ప్రధాన వృత్తులు. దురదృష్ట వశాత్తు అక్కడ ఎలుకలు కొబ్బరి పంటను నాశనం చేస్తూ వుంటాయి. కొబ్బరి పంటకు తీవ్ర నష్టం కలిగిస్తున్న ఈ ఎలుకలను నాశనం చేయడానికి ప్రభుత్వం, ప్రజలు తీవ్ర కృషిని కొనసాగిస్తున్నారు.

ఆ దీవిలో మత్స్య పరిశ్రమ శరవేగముతో అభివృద్ధి చెందుతున్నది. ఒక పడవకు 500 రూపాయలు విలువ గల చేపలు లభ్యమౌతూ ఉంటాయి. చేపలను ఉప్పు నీటిలో ఉడకబెట్టి, తర్వాత ఎండపెడతారు. ఎండిన ఆ ఉప్పు చేపలను భారత భూభాగానికి, సింహళానికి, మలయాకు నాటు పడవలమీద ఎగుమతి చేస్తూంటారు.

## పడవల నిర్మాణం

ఆ దీవిలోని వారు పడవలను నిర్మించడంలో సిద్ధ హస్తులు. సర్వాకారంలో వారు అందమైన పడవలను తయారు చేస్తారు. అవి ఎక్కువ వేగంగా ప్రయాణం చేస్తాయి. ఆ పడవలు అందంలోగాని, నడక వేగములో గాని భారత భూభాగంలో తయారయ్యే యితర పడవలకు ఏమాత్రం తీసిపోవు. పడవలపోటీలు ఆ దీవిలో వివివిగా జరుగుతాయి. అతిథులు వచ్చినప్పుడు సంప్రదాయ సిద్ధమైన జానపద నృత్యాలను వారు ప్రదర్శిస్తారు.

ఆ దీవి వాసులకు పారిశుద్ధ్యం పట్ల విశేష శ్రద్ధాసక్తులున్నాయి. చిన్నలు, పెద్దలు, వృద్ధులు వీథులను పాడుచేయకుండా, కాలకృత్యాలకు ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన మరుగు దొడ్లను వుపయోగిస్తారు. స్నానాలు చేయడానికి, బట్టలు ఉతకటానికి, వేర్వేరు తటాకాలున్నాయి. మంచినీళ్ళ చెరువులు ప్రత్యేకంగా వున్నాయి. స్త్రీలకు, పురుషులకు స్నానాలు చేయడానికి వేర్వేరుగా ఏర్పాట్లున్నాయి.

బోద వ్యాధి అక్కడ విపరీతంగా వున్నది. కలరా, మశూచికాల వల్ల లోగడ అనేక మరణాలు సంభవించాయి. ఆ దీవిలోని ప్రభుత్వ ఆస్పత్రి సిబ్బంది అక్కడి ప్రజల ఆరోగ్యాన్ని కాపాడడానికి, వైద్య సౌకర్యాలు కల్పించడానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు.

[ఆంధ్ర పత్రిక సౌజన్యంతో]

---

# గేయము

శ్రీమతి ఓలేటి సూర్యప్రభాదేవి

కరుణ రాదా శౌరి కాంచనాంబరుడా ॥
నెఱసురెన్నకు మోయి నీ దాసురాలన్ ॥
దినదినము నీ పాదవనజములు మదిలోన
ఘనముగా దలచెదను—కమలాహృదీశా ॥ క ॥
సారమేమున్నదీ సంసారజలధిలో
మేరు సమ గాంభీర్య మీ పదమే గతిగా ॥ క ॥
అనంద సంద్రాన నాడింతువీవే
ఓ నంద గోపాల నా వందనమురా ॥ క ॥
ప్రభ వందనములివిగో—పరమాత్మ గైకొనుము
పాలకడలిని జేరి పవళించు దేవా ॥ క ॥

# రంగాజమ్మ
# మన్నారుదాస విలాసము

ప్రబంధము - నాటకము

## శ్రీ యస్వీ జోగారావు

ఇటీవల జరిగిన దాక్షిణాత్యాంధ్రసాహిత్య పరిశోధనల మూలముగా ప్రసిద్ధికెక్కిన కవయిత్రి పసుపులేటి రంగాజమ్మ. ఈమె క్రీ. శ. 1633-73 సం॥ల నడుమ తంజావూరు మండలమును పరిపాలించిన ఆంధ్రనాయక రాజగు విజయరాఘవ మహీపాలు నాస్థాన కవయిత్రి. విదగ్ధవిదుషీమణి. ఆయనచే కనకాభిషేకాద్యనేక ఘన సన్మానములందిన యదృష్టవంతురాలు. ఆమె అనేక కృతులను రచించినది. ఆమె రామాయణ - భాగవత భారత కథాసంగ్రహములను రచించినదని తెలియవచ్చుటయేగాని గ్రంథములజాడ కానరాదు. నేడుపలబ్ధములగు నామె గ్రంథములు ఉషాపరిణయ ప్రబంధము. మన్నారుదాస విలాసము పేర నొక ప్రబంధము. ఒక యక్షగానప్రాయ నాటకము. అందుషాపరిణయ మిటీవల ముద్రితమైనది. (ఆం. సా. ప.; తం. స. మ.) మన్నారుదాస విలాస నాటకము సుమారు ముప్పదేండ్ల క్రిందటనే ముద్రితమైనది. మన్నారుదాస విలాస ప్రబంధ మింకను ముద్రితము గావలసియున్నది. (దాని ప్రతి తంజావూరు సరస్వతీ మహాలులోను, తత్పుత్రిక ఆంధ్ర విశ్వకళాపరిషత్తులోను గలవు. తం॥ స॥ మ॥ ప్రతి నంబరు 246. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ప్రకటించిన తంజావూరు తెలుగు పుస్తకాల కేటలాగు నంబరు 214. అది కేటలాగులో పొరపాటున పూవు గుర్తుతో ముద్రితమైనదిగా సూచింపబడినది. కేటలాగు తయారైననాటికి మన్నారుదాస విలాసము నాటకము ముద్రితమైనది. ఆ పొరపాటున కదే కారణము కావలయు.)

తెలియవచ్చినంతలో రంగాజమ్మ రచనలలో ప్రప్రథమమీ మ॥దా॥వి॥ ప్రబంధమే. చరమకృతి మ॥దా॥వి॥ నాటకము. ప్రబంధమే పిదప కాలమున విజయరాఘవుని రఘునాథ నాయకాభ్యుదయమువలె నాటకముగా పరివర్తింపబడినది. రెండింట నితివృత్త మొక్కటే. అదే మన్నారుదాస అనగా విజయరాఘవుని విలాసము. అనగా అతడు తన యిష్టదైవత మగు మన్నారు గుడి క్షేత్రస్వామి యగు రాజగోపాలునకు ఫాల్గునోత్సవము జరిపించుట, ఆ సందర్భమున ఊరేగునప్పుడు రాజచంద్రపుత్రి కాంతిమతి యను నామె విజయరాఘవుని జూచి మోహించుట, ఆమె చెలికత్తె విజయరాఘవు నొద్దకు దూతిగా పోవుట, తరువాత రాజగురు వగు శతక్రతు శ్రీనివాస తాతాచార్యులు రాజచంద్రుని (అతడొక రాచ పాడిగల సంపన్న గృహస్థుకాదగును) కడకేగి పెండ్లిమాట లాడుట, వివాహము, తదుపరి పడకటింటి ముచ్చట- ఇవీ పంచాశ్వాస పరిమిత మగు నీ ప్రబంధమున వర్ణితములైన విషయాలు. ప్రక్రియాంతరము, అంక విభాగ విరహితమునగు ఆ నాటకమున ప్రధానేతివృత్తమంతా యిదే కాని నాటకీయత సాధించు కొరకందు ప్రబంధము నందలి కొన్ని విషయములు పరిహరింపబడినవి, కొన్ని క్రొత్త చేర్పులును గలవు. ముందుగా ప్రబంధావతారికలోగల విశేషముల నుదహరించి పిదప రెండింటి భేదసాదృశ్య పరిశీలన చూతము.

### మన్నారు దాస విలాస ప్రబంధావతారికా విశేషములు :

1. విజయరాఘవుని రాణులు : ఆజమ్మ, చంపకవల్లి. (ఇతనికి రాజగోపాలాంబిక యను రాణియు నున్నట్లును, విజయరాఘవుని పుత్రుడగు మన్నారు దేవుని కన్నతల్లి ఆమెయే అనియు అతని హేమాబ్జనాయికా స్వయంవరమునుండి తెలియవచ్చినది.) ఈ ప్రబంధము సరిగా ఏ సంవత్సరమున రచింపబడినదో చెప్పలేముగాని, తద్రచనా కాలమునాటికి విజయరాఘవునకు మున్మనుమలు నున్నట్లిం దొక వచనమున గలదు.

2. విజయరాఘవుని సముఖమున కస్తూరెమ్మ, అంబుజవల్లి, శశిరేఖ, మోహనమూర్తెమ్మ, 'సరసగుణ నిష్ణాతయగు కృష్ణాజమ్మ', అలమేలమ్మ, సీతమ్మ,

మదనరేఖ మొదలగు వారు వసంత కేళిక వినిపించినారట. (కృష్ణాజమ్మ గొప్ప కవయిత్రి యనియు విజయరాఘవు నాస్థానకవి యగు చెంగల్వకాళకవి శిష్యురాలనియు నాతని రాజగోపాల విలాసమువలన ఎరుకపడినది. ఇపుడీ గ్రంథమువలన ఆమె కలము పట్టుటయే గాదు గజ్జె కట్టగలదనియు దెలిసితిమి )

3. రంగాజమ్మ విజయరాఘవుని తన ప్రాణనాయకుడని పేర్కొన్నది. ఇందు ప్రథమ ద్వితీయాశ్వాసాంత గద్యల చివర 'నా విభుండైన మన్నారు దాసుని...' ఇత్యాదియగు నొక ఫలశ్రుతి సీసపద్యము రంగాజి రచించినదిగా గన్పట్టుచున్నది.

4. విజయరాఘవుడు 'రాయలు సాహిత్యరాయ పెండెరంబు, శారదాధ్వజమును నొసంగ నెగడె'నని కలదు. (ఆ రెండింటి ప్రశంస కాళకవి రాజగోపాల విలాసమునందును గలదు )

5. తంజాపుర వర్ణనము దీర్ఘముగా ప్రబంధపు బాణీని సాగినది. అందు వీర స్త్రీ వర్ణనమునకు ప్రత్యేకముగా అయిదు పద్యములు పట్టుట విశేషము.

6. విజయరాఘవుని తల్లి కళావతీ దేవి వెంపరాజు పుత్రి యనియు, అతనికి చెంజిలక్ష్మమ్మయను మారటతల్లియు నున్నట్లు గలదు. ఈ విషయము గ్రంథాంతరము లందును గలదు.

7. తంజావూరు నాయకరాజు వంశాను క్రమణికలో రంగాజమ్మ తన యితర కృతులందు వలెనే కృష్ణభూపతి కొడుకు తిమ్మనృపాలు డనియు నీతనికి గోపమాంబిక వలన తిమ్మనృపాలుడు కలిగెననియు గలదు. గోపమాంబికా తిమ్మనృపాలుర తరము విజయరాఘవుని రఘునాథాభ్యుదయమున లేదు.

8. ఇందవతారికలో నొకచో రంగాజమ్మ 'మా యయ్య తాతాచార్యు'డని చెప్పినది.

ప్రబంధము-నాటకము : భేదసాదృశ్యములు :

1. ప్రబంధమందలి ఆశ్వాసాంత గద్యయు నాటక గ్రంథాంత గద్యయు నున్నంత మట్టున కాకే తీరున నున్నవి. కాని నాటక గద్యయందలి విశేషములు కొన్ని మాత్రము ప్రబంధ గద్యలో లేవు. అవి విజయరాఘవ కృత కనకాభిషేక సన్మానము, ఉషాపరిణయ రామాయణ భాగవత భారత సంగ్రహ రచనల ప్రశస్తులు. అనగా అవి యీప్రబంధ రచనాకాలమునాటికి జరుగలేదన్నమాట.

2. కథావిషయమున నాటకమునగల జోస్యుల, వేషాగాథాలు, విద్వాంసుల యద్వాతద్వాలు, ఎఱుక ఘట్టము, గొల్లల ప్రసంగములు, ముత్తైదువల ముచ్చటలును ప్రబంధమున లేవు.

3. వర్ణనల విషయమున ప్రబంధ నాయిక సఖీజనముతో వనవిహారము, జలకేళి సవదరించుట, ఆమె విరహవేదన, పెండ్లి వేడుకలు మొదలగునవి నాటకమున సంగ్రహింపబడినవి. (ఆ విందు వర్ణన సందర్భములో నొక దీర్ఘ గద్యలో, విజయరాఘవుని రఘునాథాభ్యుదయమునందు వలె అపూర్వమైన ఒక పదార్థాల పట్టిక గలదు. అందులోనివి కొన్ని పేర్కొనదగినవి గలవు—కప్పురభోగి వంటకము, బీరంజి, పాలకోడి, కుంకుమ కోడి, కట్టుకోడి, పుడపిట్ట తాలింపు, పొడగువ్వ, తీతువు బాతువులు సంబారంపుకోడి, పొదుగుడుకోడి, ఉప్పులుగ వండిన ఉల్లంకి నేల నెమలి, జాళె నంజుడు, ఉలువ కోడి, సన్నకారిజంబుల యూరుపు, పాడి నల్లలు, దరినల్లలు చిక్కుడుకాయలు రొయ్యల యూర్పు, ఉలుచలు, జల్లల బిల్లలు, బొమ్మిడాయలరులు, ముప్పురనంబులు, గువ్వలయానము, సారసత్తులు, చక్కెరబురుడలు, పేణములు, మణుంగు బువ్వలు, ఊసుపులు, పేణీలు, పొగడ పూవుల కజ్జాయములు, పుండిగలు (చక్కెర-మెఱుంగు-గనగనల), సురుగులు, నేత్రంబులు, కరివడలు, చంద్రకుండములు, బొంగరములు, అంగరవొల్లెలు, అడ్డుకములు, ఇడ్డెనలు, ఉక్కెర, పన్నీరు పాయసము.)

4. రచనా విషయము : నాటకమందలి సీసపద్యము లన్నియు ప్రబంధమున నున్నవే. ప్రబంధమునగల గీత కంద వృత్తములు, గద్యలుగూడ కొన్ని నాటకమున గ్రహింపబడినవి. ప్రబంధమునందలి వర్ణన ప్రసంగములు కొన్ని నాటకమున కవి వచనము లనుపేర సంఘటింపబడినవి. నాటకమున అదనముగా సంధి వచనములు కొన్ని యుటంకింపబడినవి. ప్రబంధమునందలి సీసములు

కొన్ని నాటకమున ద్విపదలుగా. దరువులుగా పరివర్తింప బడినవి.

ఉదా: 'ఆయింతి 'మరుదంతి యలరులబంతి'– ఇత్యాది యగు ప్రబంధ సీసము నాటకములో ద్విపద. (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ– మ॥దా॥వి॥నా॥ పుట 32.)

'ఎలనాగ చూచితె యీ విభు మోహంబు'– ఇత్యాదియగు ప్రబంధ సీసము నాటకమున సావేరిరాగ–ఆట తాళ దరువు. (చూ. మ॥ దా॥ వి॥ నాటకము పుట 40)

'ఆచార్య నినునమ్మి యాత్మజ నిచ్చితి'– అన్న ప్రబంధ సీసము నాటకమున బిలహరి దరువైనది. (చూ. మ॥దా॥వి॥నా॥ పుట 51.)

(నాటకములోని సీసములుగాక 9 వ పుటలోనున్న ఊరేగింపు వర్ణన వచనము. 14 వ పుటలోని గీతము. 19 వ పుటలోని మత్తేభము, 25–26 పుటలలోని నాయనివారి సామర్థ్య సన్నాహవచనము. 34 వ పుట లోని కందము. 38 వ పుటలోని చంపకమాల, 41 వ పుటలోని వచనము. 42 వ పుటలోని రెండు కందములు, 44 వ పుటలోని గీతము, అదే పుటలోని రెండవ వచనము. 51 పుటలోని కందము ప్రబంధమున ఇంచు మించు యథాతథముగ గన్పట్టుచున్నవి. నాటకము ప్రచురితమైనది కనుకను, గ్రంథ విస్తర భీతి చేతను ఉదాహరణ లుజ్జగించితిని.)

ఇవి యన్నియు జూచినచో ప్రబంధమే నాటకముగా పరివర్తింపబడిన దనుటలో సందేహ ముండరాదు. ప్రబంధమును నాటకముగా పరివర్తించుట కష్టమైన పని కాని ఆ పరివర్తనమును నిపుణముగా నిర్వహించిన రంగాజమ్మ కడు ప్రశస్య.

ఇక నొక విశేషము: మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నందలి డి. సం. 786 '(అల్లాడ) విజయ భూపతి సింహవిలాస' మను గ్రంథము గూర్చి కేటలాగు కర్త లొక వక్కాణ వ్రాసియుండిరి. (చూ. G. O. M. L., D. C., Vol II- Part II, PP. 1041-42):—

రాజరాజనరేంద్రు ననంతరము రాజమహేంద్ర పురాధీశ్వరుఁడైన యల్లాడ విజయభూపతి సింహుని శృంగార చరిత్రము నాతని భార్యయు, రాచవీటి నరపతికిని మౌక్తికాంబికకును గూఁతురునగు సౌందరీదేవి అల్లాడ విజయ భూపతిసింహ విలాసమను పేరఁ బ్రబంధముగా రచియించినట్టిందుఁగలదు. ఇది పట్టి బూటకముగాఁ దెలియ వచ్చుచున్నది. తంజావూరి తెలుఁగు రాజై సుప్రఖ్యాతుఁడైన విజయరాఘవ నాయకుని ప్రేమపాత్రమగు రంగాజి యను స్త్రీ రచియించిన విజయరాఘవ చరిత్రమే యగు మన్నారుదాస విలాస మను ప్రబంధమే యిది యగును. కర్త పేరు, కృతి నాయకుని పేరు, మొదలగునవి యింద న్యథాకరింపఁబడినవి. ఇం దప్పుడున్న విషయమునఁ గృతినాయకాదుల చరితాంశ పరిశీలకులకు గోచరింప కున్నారు."—— ఈ వక్కాణ సరియైనదే.

మరియొక విశేషము: పూజ్యశ్రీ నిడదవోలు వేంకట రావుగారు తమ 'దక్షిణదేశీ యాంధ్ర వాఙ్మయము' అను గ్రంథమున 128 పుటలో "ఈ మన్నారుదాస విలాసముననే రంగాజమ్మ యొక దండకము గూడ విజయరాఘవుని పేర రచించినది. అదియు పైవిధముగా మార్పు చెందినది. అల్లాడ విజయసింహ భూపతిపై 'మోహిని' అను నామె మరులు కొనుట, పొందుట యుందలి విషయము. ఇదియు మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక శాలలో 'మోహిని దండకము' అను పేర కలదు. సంఖ్య 2001."

ప్రాచ్యలిఖిత పుస్తక శాలలో డి. సం. 2001- మోహినీదండక మున్నమాట వాస్తవమే కాని అది శ్రీ వేంకటరావుగా రన్నట్లు మన్నారుదాస విలాసమున మాత్రము లేదని మనవి.

మన్నారుదాస విలాస ప్రబంధము రంగాజమ్మ ప్రాథమిక రచన మైనను మంచి పాకమున బడినదనియే చెప్పవచ్చును. నాటకమున రచన మరియు జక్కని పైపువాటములతో సాగినది.

వి : కర్షకుడా : ఈతడు చేసిన తప్పేమి ?

కర్ష : తల్లీ ! పాడు పడిన దేశము నుద్ధరించెను. మా వంటి బీదవారికింత తిండి పెట్టెను. ఈయన మీదకే ఈ విప్లవమన్న సంగతి తెలియక మేము వచ్చితిమి. మమ్ముల నిచ్చటనుండి విరమించుకొననిండు.

వి : నావంటి అబలను అవమాన పరచిన మీ కవమానము కాదా ?

క : ఇది మీరు తేల్చుకొనవలసిన విషయము. మీ స్వవిషయములో మాకు పనిలేదు మొదట మీరు మమ్ములను ఈయన కప్పగించిరి. మేము బాగు పడ్డాము. ఇప్పుడు స్వవిషయమును మాకు చెప్పి ఈయనను బంధింపమనకుడమ్మా !

వి : కార్మికులారా ! మీరేమి చెప్పెదరు ?

కా : రైతులు చెప్పినదానిలో తప్పేమియులేదు.

వి : ఇంతమంది ఆయనను రక్షించిరి. నా దేశమును బాగుచేసిన నేను కూడ ఇతనిని రక్షించితిని. కాని ఇకపై నాతడు శ్రద్ధాదేవితో కూడినవాడై నా సహాయ సానుభూతులతో మెలగవలయునని నా ఆశ. ఇతనిని క్షమించితిని.

మ : (తలవంచి నిలచి యుండును.)

శ్ర : విద్యాదేవీ ! ఇదుగో నా కుమారుడు. వీనిని నీవు పెంచి విద్యాబుద్ధులు గరపి మానవునిగా తయారు చేయుము. నేను నా భర్తతో హిమవత్పర్వతమునకు పోయి శేషజీవితమును వానప్రస్థములో గడుపుదుము.

మ : సారస్వత ప్రజలారా : మీకు నేనెంతయు కృతజ్ఞుడను. నా కృతజ్ఞత చూపుటకే నా కుమారుని మీ సేవకై అర్పించుటకు అంగీకరించుచున్నాను. మీకు శుభమగు గాక ! శలవు.

---

నా టి క :

# శ్రద్ధ

శ్రీమతి సరస్వతుల కామేశ్వరి

ఈ కథ స్వర్గీయ శ్రీ జయశంకర ప్రసాద్ రచించిన 'కామాయిని' యను హిందీ కావ్యము నుండి తీసికొనబడెను. "శ్రద్ధా, మానవుల సంయోగము వలననే మానవసృష్టి యైనదని హిందువుల శాస్త్రము." మానవుని మనోభావములను మానవీకృత మొనర్చి యిందు చూపడమైనది.

మనువు చింతాక్రాంతుడై యుండగా శ్రద్ధ కలుగును. శ్రద్ధాగ్రస్తుడై యుండగా ఫలప్రాప్తి యైనది. స్త్రీలకు సంతానముపై మమత ఎక్కువ. ఇది ప్రకృతి. ఇది అర్థము కాని మనువు శ్రద్ధను త్యజించెను. కాని బుద్ధి సహాయమున దేశ పునర్నిర్మాణము గావించెను. శ్రద్ధ లేకపోవుటచే నిగ్రహము సడలి బుద్ధి దుర్వినియోగమయ్యెను. తిరిగి శ్రద్ధ కలిగిన వెంటనే బుద్ధి స్వాధీనమైనది.

:o!

## 1 వ అంకము

స్థలము : ఎత్తైన హిమగిరి శిఖరముపై కూర్చున్న మనువు నీటి బిందువులచేతను, చల్లని గాలిచేతను తన్మయుడై ఆలోచించుచుండెను. వాతావరణములో నిశ్శబ్దత. నిశ్శబ్దతలో ఆలోచనలు.

మనువు : ప్రకృతి తన కఠిన దృష్టిలో సమస్త మానవ కోటిని నాశనము చేసినది. మిగిలినది నే నొంటరిగా-సమస్త సౌఖ్యములు త్యజించితిని. ఆ సౌఖ్యములు తలచిన కలవలె తోచుచున్నవి. బలము, ఆనందము, సుఖము ఇవి సముద్ర కెరటములవలె వచ్చుచు పోవు చుండును. ఇవి శాశ్వతమను తలపుతో మానవులు మ్రగ్గుచుందురు. చివరకు ప్రకృతి శక్తిలో లీనమగు దురు. వసంతము— శిశిరము— తిరిగి వసంతము— ఇదేనా ప్రకృతి? ఇదేనా శక్తి? చివరకు మృత్యువు- నిరాశ— శీతలము— దీని పరిణామము——

ఒక స్త్రీ ప్రత్యక్షము- ఆమె అందము మేఘములమధ్య మెరపు తీగెతో సమానము.

మ : నీ వెవరవు? నన్ను పరిహసించుటకు స్వర్గము నుండి దిగివచ్చిన దేవకన్యవా?— చనిపోయిన నా బంధువులలో నొకతెవా? నీ విట్లు వచ్చి నన్నేల బాధింతువు?

శ్రద్ధ : నేను శ్రద్ధను. దేవతనూకాను - ప్రేతమునూ కాను. నేను గంధర్వ దేశపు కన్యను. నాకు అప్పు డప్పుడు విహారమునకు పోవు అలవాటు. దీనిలో నా కెంతో హాయి. ఎంతో ఆనందం.

మ : (తనలో) ఈమెను చూచినది మొదలు నాహృదయ మెందుకో ఆరాటముగా ఉంది. (ప్రకాశముగా) శ్రద్ధా! నీతో మాట్లాడవలెనని కోరికగానున్నది. మీదేశ స్థితిగతులు తెల్పి నాకు సంతోషము కలుగజేయుము.

శ్ర : ప్రపంచము "మహావిశ్వము." కాని చింతవలన ఆరాటము, దానివలన చలనము కలుగుచున్నది. నీవైఖరి చూడ నీవేదో అధీరుడ వయినట్లు తోచు చున్నది. వీరులు బ్రతికియుండి సాధించదగిన కార్యము లెన్నియో యున్నవి. నిత్యము పరివర్తన చెందుటచే ప్రకృతి ఎంత రమణీయముగా నున్నది! నీవు

మాత్రమేల పరివర్తనచే తేజోమయుడవు కారాదు ? సురాసుర దేవగంధర్వులకే ఆశ్చర్యముకొల్పు ప్రతిసృష్టిని చేసి ధన్యుడ వేల కారాదు ?

మ : నేను చింతచే చలించిన మాట నిజము. ప్రతిసృష్టి నెట్లు చేతును ? నాకంతటి శక్తి యున్నదా ?

శ్ర : నేనుండగా నీ వశక్తుడవెట్లు— నీవు— ఈ ప్రకృతి వైభవము— నీవు కర్మనుచేసి దాని ఫలితమును అనుభవించుము. నేను సహాయనై యుండ, నీవు అసహాయుడవు కాలేవు. నీ ఆత్మ విచారమును విస్తరింపచేయుము. ప్రకృతి శ్రద్ధల సహాయుడవై కార్యమున కుపక్రమించుము.

మ : నీ మాటలలో నుత్తేజము పుట్టుచున్నది. కాని ఆకర్షహీనుడను- నీటిలో కొట్టుకొనుపోవు నావకు సమానుడను. తెడ్డు లేదు. చుక్కాని లేదు. ఏ ఆధారముతో పడవ నడుపుదును ?

శ్ర : 'శ్రద్ధగల వానికే విజయ'మను మహావాక్యమును విన్నలేదా ? నీకేమి భయము ? నీకు బుద్ధిగలదు. జీవన కేంద్రమునందు ఆకర్షణ గలదు. దానికితోడు శ్రద్ధ నీ పక్షమైయుండ విచారమేల ? నీకు జయమగును.

## 2 వ అంకము

(శ్రద్ధ పుష్పముల నేరుచుండును. ప్రవేశము మన్మథుడు. మనువు తోటపని చేయుచుండును.

మన్మథుడు : (తనలో) మనువు తన పనిలో నిమగ్నుడై యున్నాడు. నిగ్రహశక్తిని పోగొట్టి మనువును సాధారణ మానవ ధర్మమునకు త్రిప్పుటకు ప్రయత్నించవలెను. ఇది సాధ్యమా ? వసంతములో మత్తెక్కిన మధుపము వికసించిన పుష్పముల చెంతకు రాలేదా ? మనువుమాత్ర మిట్లెంతకాలము నిగ్రహమును పట్టుకొనగలడు. నేను తలచిన వీని నిగ్రహమేపాటిది ? (ప్రకాశముగా మనువుతో) ఓ మనువా ! అటు చూడు. కోయిల ఎంత తియ్యగా పాడుచున్నదో ; ఇటు చూడు. తుమ్మెద పూవునందలి మకరందమును గ్రోలుచున్నది. తూర్పు దిక్కున చూడు. దిగంతమునందు భూమ్యాకాశము లెట్లు కలయుచున్నవో- పడమట చూడు. సంధ్యారుణకాంతులెంత అందముగా నున్నవో ? ఆ ఎరుపులో నీలి రంగు నిన్ను ఆకర్షించుటలేదా ?

మ : (మౌనముగా తన పనిలో నుండును.)

మన్మ : ఏ మట్లు మౌనముద్ర వహించితివి ? నా మాటలలో నీకు విశ్వాసమేలేదా ? విశ్వాసమెందుకు ? ప్రత్యక్షమునే చూపుచుంటినిగదా ? ఇవి చూచి కూడ నీ కెందులకీ నిగ్రహము-చూడు- శ్రద్ధ నీకొరకై ఎంత సేవ చేయుచున్నదో- ఇప్పటికీ దానియర్థము తెలియలేదా ? లెమ్ము. త్వరగాపోయి శ్రద్ధను నీదానిగా గైకొమ్ము.

మ : (చూపుడు వ్రేళ్ళను రెండు చెవులలో నుంచుకొని అన్ని దిక్కుల చూచి) ఏమి ఈ మాటలు- నాకు పని చేయవలెనని లేదే- ఇంతలో నా మనసేల ఇంత మారెను ? (ఆలోచించి) ఏమి నేను శ్రద్ధ నర్థము చేసుకొనలేదా ? మూర్ఖుడను- ఏదైనా ఉపాయముతో శ్రద్ధే ఇటు వచ్చునట్లు చేయవలెను- పాడుదునా ? ఆహా చక్కని ఉపాయము- ('లలిత రాగము' నాలపించును )

(శ్రద్ధ పూవులు కోయుట మాని దీక్షతో వినుచుండును.)
(మనువు సగములో రాగమును ఆపును.)

శ్ర : మనువువద్దకు వచ్చి- ఏల పాటను ఆపితివి ? ఇంత లాలిత్యమున్న మీరే ఇంత విరాగులుగా నుండిరా- ఈ విరాగమునకు చింత కారణమా ?

మ : లేదు శ్రద్ధా లేదు- నిగ్రహము సడలినది- నీ సేవకు లోబడితిని !

శ్ర : ధన్యను- స్వామీ- ధన్యను. ఈ అనుగ్రహమునకే ఇన్నాళ్ళు వేచియుంటిని-

(మనువు శ్రద్ధ చేతిలోని పూలనుతీసి ఆమె తలలోనుంచును)

## 3 వ అంకము

(శ్రద్ధ పిల్లవానితో ఆడుచుండును. మనువు ప్రవేశము)

శ్ర : వృక్షములారా ! మీ పుష్పము లందముగా నున్నవని నన్ను పరిహసింతురా. ఇదుగో ఈ నా పుష్పము మీకంటె అందముగానున్నది—

మ : (కోపముతో) శ్రద్ధా నీకు చెట్లతో ఆటలేమి ?

శ్ర : మనువును వినకయే- ఓ లేడిపిల్లా ఇక్కడకు రా నా బాబు నీతో ఆడుకోవాలంటున్నాడు- పిల్లవానితో- బాబూ ఆడుకుంటావా ?

మ : శ్రద్ధా పిలిచినా వినిపించుటలేదా ? ఎంత తృణీకారము— ఈ పిల్లవాడిని చూచినది మొదలు నిర్లక్ష్యముగానేయున్నది— పశుపక్షులపైనను ఈ తుప్పల పైన నున్నప్రేమ నామీద లేదు— ఈ స్థితిలో నేనీమె వద్ద నుండి ప్రయోజనమేమి—

శ్ర : మనూ- వీడిని చూడు- లేడి కావాలిట- నేను పోయి దానిని తెస్తాను ఒక్కసారి పట్టుకోవూ- బాబుని-

మ : నిర్లక్ష్యముగా వెనుకకు తిరుగును.

శ్ర : బాబూ- మీ నాయనకు నీవంటే కోపము- పోనీలే రా-మనిద్దరంపోయి తోటలో అన్నీ చూదాం.

(ఇద్దరూ వెళ్ళిపోతారు.)

మ : ఈమె గర్వం రోజూ రోజూ పెరిగిపోతున్నాది- కానీ దీని పొగరెంతలో పోగొడతాను- ఎలా మారి పోయింది- నా దారి నాది- ఈమె దారి ఈమెది.

## 4 వ అంకము

(విచారముతో మనువు- విద్య ప్రవేశం.)

మ : ఈ త్రివేణీ నదికి జీవితానికి గల భేదమేమి ? నా జీవిత మెంత చిత్రముగా ఉంది. పర్వత శిఖరమున ఒంటరిగా నడిపిన జీవనమే ఎంతో హాయిగా ఉంది. ఇప్పుడు గాలి లేనప్పు డెగురవేసిన గాలిపడగవలె ఇసుకలో పడవలసివచ్చింది- (ఆలోచన)

అయ్యో నేనెంత మూర్ఖుడను. శ్రద్ధ తన సంతానముపై ప్రేమ చూపుటలో వింత ఏమి ? నే నెందు కామెను విడచి వచ్చితిని ?— నాజీవితము అమావాస్య నాటి చీకటి పోలిక యైనది- ఒంటరి జీవితములో నాకు సహాయిరాలైన శ్రద్ధను విడిచితిని- తిరిగి ఆమె ముఖమెట్లు చూడగలను-

ఒక స్త్రీ కంఠము : ఓ మనువా! నీవు పూర్ణవిశ్వాస మయియయిన శ్రద్ధను త్యజించితివి- తిరిగి ఎందుకిట్లు చింతించుచున్నావు ?- స్త్రీలకు కూడ శక్తిగలదు.

మ : నీ వెవరవు ? ఓరీ- మన్మథుడా- ఇదివరకు నన్ను పెట్టిన బాధ చాలదా ? తిరిగి వచ్చితివా ?

విద్య : ఇది సారస్వత దేశము- నీవు త్రివేణీ పీఠముపై కూర్చున్నావు. నేను విద్యను- మన్మథుడనుకాను- ఓయి మనువా! నీవేల ఇట్లు దేలపై కూర్చుందువు- లే! జీవితమొక యుద్ధము- చావు పుట్టుకల్లో నీకు శాంతిలేదు- చింతలేదనుకొనినచో నీవు అమరుడవే- నీలో నున్న సహజ ప్రతిభ నుపయోగించు-

మ : బుద్ధీ! నీవు చెప్పిన వైరాగ్యము బాగుగనేయున్నది. గాని శ్రద్ధా విహీనుడనైన నేనేమి చేయగలను ?

వి : నీవు శ్రద్ధా విహీనుడవేగాని బుద్ధికి లోటులేదుగదా ? నీవు కష్టము లనుభవించుచుంత నే నెట్లూరక చూచుచుందును ?

మ : అయిన బుద్ధి సహాయముతో చేయగల పనులేమి ?

వి : మనువా! నా ఈ దేశము పాడుపడియున్నది- దీనిని పునర్నిర్మాణము చేయుము- ఇచ్చట పరిశ్రమలను వృద్ధి చేయుము- మనుష్యులను ప్రేమగా చూచి అసహాయుల నుద్ధరించుము- దీనికి మార్గము నేను చూపింతును.

## 5 వ అంకము

(మనువు ప్రవేశము)

మ: రైతులారా! మనఃపూర్వకముగా భూమిని దున్నుడు- రైతు మానవుని వెన్నెముకయని మీకు తెలుసుకదా! అలసులై కాలము నేల వృథాచేతురు ? కావలసిన ధనము నా ధనాగారమునుండి నేనిచ్చెదను.

రైతులు : స్వామీ! తమవంటి వారి సానుభూతి మా యందుండ మేమేల సోమరిగా యుందుము ? తమ ఆజ్ఞను సిరసా వహించి మన దేశమునకేకాక ప్రపంచమునకే సరిపోవు పంట పండింతుము.

మ : ఓ కార్మికులారా! ఏమాలోచించుచున్నారు. కాలము ప్రవాహమువంటిది. ప్రవాహ వేగమునకున్న నీటి నెట్లాప జాలమో కాలమును అట్లే- మీ శక్తిని వ్యర్థపుచ్చకుడు- దేశ క్షేమమే మీ క్షేమము.

కార్మి : ప్రభూ! మా శక్తిని దేశమునకే కాక సర్వ

లోకములకును చూపి భరత ఖండపు ఖ్యాతిని నిలుపుటకు ప్రయత్నించెదము.

(ప్రవేశము మేస్త్రీ)

మేస్త్రీ : మహాప్రభూ ! తమ ఆజ్ఞానుసారము పురమును పునర్నిర్మాణము చేసితిమి. తమరు పురవీధులను, ఇండ్లను చూచుటకు దయచేయవలెను.

మ : భేష్ ! ఇప్పటికి మీరు ధన్యులు.

(శిల్పి ప్రవేశము)

శిల్పి : దేవాలయ ప్రాకారములందు శిల్పమును చూడుడు. నేమైన మార్పు సూచించిన మేము చేయుటకుసిద్ధము,

(ఇద్దరూ లోనికి పోయి తిరిగి ప్రవేశింతురు)

మ : శిల్పీ ! ఇప్పటికి నీవు భారతీయుడ వనిపించుకొనుట కర్హుడవోయి ! (వీపుపై నిమురును)

(కళా ప్రియులు ప్రవేశము)

నాట్యకర్త : దేవా ! దర్బారు నేర్పరచుడు. అందుకు కావలసిన నాటక, నృత్య, వాద్య, గాన, కళలను తగు రీతిని చూపుట కేర్పాటు గావించితిమి !

మ : మీరు కోరినట్లే జరుగును— మీరు ధన్యులు !

(అందరూ నిష్క్రమింతురు. మనువు ఒంటరిగా)

మ : ఏమి, నాకింత శక్తి యున్నదా ? జనులనందరనూ నావైపు లాగికొంటిని- ఇంతమంది నా ఆజ్ఞానుబద్ధులై నేను చెప్పినదెల్లా వేదమని నమ్మి పనిచేయుచున్నారు. జీవితములో సుఖమా— దుఃఖమా ఏది ఎక్కువ ? ఆకాశములో నక్షత్రము లెక్కువా ? సాగరమున నీటి బిందువులెక్కువా ? ఈ ప్రతిసృష్టి ఈ కల్పితసృష్టి ఇంత ఆనందదాయకమా ? ఇన్నియున్నను నా మన సెందుకో శాంతిగాలేదు. ఇన్ని విషయములను చూచితిని. ఇందరిని లోబరచుకొంటిని. గాని విద్యాదేవి జాడే తెలియుటలేదు— ఈ విద్యాదేవిని స్వాధీనము చేసికొనిననే నాజన్మ సార్థకము. లేనిచో నా జన్మమేల ?

(విద్యాదేవి ప్రవేశము)

విద్య : మనూ ! ఏమాలోచించుచున్నావు ? నీవెంత శక్తిమంతుడవో ఇప్పటికైన తెలిసినదా ?

మ : (విద్య నాలింగనము చేసికొని) ఇప్పటికి ధన్యుడను— నా సృష్టికంతకు ఈ ఆశే కారణము.

విద్య : (కోపముతో దూరముగా పోయి) ఓ నీచుడా ! ఎన్ని యుండియు నీలో నిగ్రహములేదు ! దానిచేతనే నీపతనము- ప్రకృతే ఈ నీ చర్యకు నీపై ఎదురు తిరుగును.

మ : (విద్యాదేవి చేయి గట్టిగా పట్టుకొని) నాకు కావలసినది దొరికినపుడు- ప్రకృతి కాదు- భగవంతుడెదురు తిరిగిననూ నాకు భయములేదు.

వి : (గట్టిగా అరచి) మహాజనులారా ! సంఘసంస్కర్తలారా ! విప్లవకారులను పిలచి విప్లవమును లేవనెత్తుడు. వీని పొగరణచుటకు సమయమాసన్నమైనది. నా దేశములో నన్నే అవమానపరచునా ?

(విద్యను తెరలోనికి తీసికొని పోవును.)

(జనుల ప్రవేశము. వారి మధ్య బందీగా చేతులను కట్టిన మనువు.)

(రెండవ వైపునుండి శ్రద్ధ కొడుకు నెత్తుకుని ప్రవేశము)

## 6 వ అంకము

(న్యాయస్థానము- విద్యాదేవి న్యాయాధిపతి స్థానములో)

ప్రథమ సాక్షి : శ్రద్ధాదేవీ !

విద్య : నీ భర్తయని ఎట్లు ఋజువుచేతువు ?

శ్రద్ధ : దానికి బాలుడు తప్ప మరి సాక్ష్యమేమియులేదు.

వి : నీ భర్తయైన నిన్నేల విడచివచ్చెను ?

శ్ర : నాతప్పులేదు- దానికారణము చెప్పలేను.

వి : ఇతని ప్రవర్తన నీచమని అంగీకరింతువా ?

శ్ర : ఇతడు నా దృష్టిలో అట్టివా డెన్నటికిని కాడు.

వి : పతివ్రతా హృదయము- దయా సముద్రము- అందులో అమృత తరంగములు లేచుచుండును. దానిని త్రాగలేనివారు ఈతనివలె పరిత్యజింతురు.

శ్ర : విద్యాదేవీ ! నీవు న్యాయాధికారిణివి ! ఇచ్చట నీవు నా శీలమును గాని నా పతి హృదయమును గాని విమర్శింప పనిలేదు.

# మహిళా సమాజములు

———— :o! ————

## శ్రీకాకుళము మహిళా సంఘము

మొన్ననే సర్వసభ్యసమావేశముచేసుకొని క్రొత్తకార్యవర్గము నెన్నుకొనినది. క్రొత్తకార్యవర్గ సభ్యులు. శ్రీమతి. టి. సత్యనారాయణరావు అధ్యక్షురాలు శ్రీమతి డి. సువర్ణాబాయి ఉపాధ్యక్షురాలు. శ్రీమతి. జి. సూర్యకాంతమ్మ కార్యదర్శిని శ్రీమతి. కె. ఆర్. రావు సహాయ కార్యదర్శిని. కార్యవర్గసభ్యులు: శ్రీమతులు అన్నపూర్ణమ్మ. బి. జోగులమ్మ, టి. పద్మావతి, ఎన్. తాయారమ్మ, ఎన్. చిలకమ్మ, టి. హైమావతమ్మ, కె. సీతాకుమారి, ఎమ్. శివకాంతగార్లు.

## సంగంజాగర్లమూడి మహిళా సంఘము

మొన్ననే సర్వసభ్యసమావేశము, మహిళా సమాజపు వార్షికోత్సవము, శిశు శరణాలయపు వార్షికోత్సవము చేసుకొని క్రొత్తకార్యవర్గము నెన్నుకొనినది. అధ్యక్షురాలు శ్రీమతి. ప. జానకమ్మ. కార్యదర్శిని. శ్రీమతి. కొత్త. రంగనాయకమ్మ, శ్రీమతి. కె. లక్ష్మీదేవమ్మ కోశాధికారిణి.

*   *   *

భారతదేశ స్వాతంత్ర్య నవ వార్షికోత్సవ సందర్భమున ప్రభాత సమయమున భారత సేవక్ సమాజము మహిళాశాఖ సభ్యురాండ్రచే పతాకావిష్కరణ చేయబడెను. తదుపరి సాయంకాలము కొత్త భావయ్యచౌదరి గారి అధ్యక్షతన సభ జరుపబడెను. ఆ సభయందు ఈ సమాజ హిందీ విద్యార్థినులచే హిందీలో ఆనాటి ఉత్సవము యొక్క ప్రాముఖ్యమును గురించి వుపన్యసించబడెను. శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య చౌదరిగారు స్వాతంత్ర్యమును గురించి వుపన్యసించిరి. వారి శిష్యులయొక్క మంగళ గీతములతోను, ఫలహారములు పంచిపెట్టుటతోను ఉత్సవము సమాప్తము చేయబడెను.

## భారత సేవక సమాజము-మహిళాశాఖ

పండరిపురం – గుంటూరు.

క్రిందటి నెల 23 వ తేదీన శ్రీ లోకమాన్య బాల గంగాధర తిలక్ శత జయంతి ఉత్సవము ఈ సమాజము వారు అతివైభవముగ జరిపిరి. దీనికి శ్రీమతులు రమణమ్మ చంద్రారెడ్డి, పాపాయమ్మ భీమశంకరం, మొదలగు అనేకమంది ప్రముఖ స్త్రీలు హాజరైరి. శ్రీమతి యలవర్తి దేవమ్మగారు పతాకారోహణ జరిపిరి. శ్రీమతి ఆవుల జయప్రదాదేవిగారు లోకమాన్యుని స్వాతంత్ర్యేచ్ఛ, అచంచలదీక్షను గురించి విపులంగా ఉపన్యసించిరి.

*   *   *

ఆగస్టు 15 వ తేదీన స్వాతంత్ర్య దినోత్సవమును జయప్రదముగా జరిపిరి. శ్రీమతి కొండా పార్వతీదేవిగారు పతాకారోహణ తదుపరి వికలాంగుల శరణాలయమునందున్న 25 మంది బిడ్డలకు తమ తండ్రిగారైన కొండా వెంకటప్పయ్యగారి స్మారక చిహ్నంగా నూతన వస్త్రదానము చేసిరి. భారతపిత అయిన గాంధీమహాత్మునితో పాటు అనేకమంది దేశభక్తుల జీవితార్పణములను సవిస్తరముగా సభాసదులకు తెలియజేస్తూ స్వాతంత్ర్య సమరంలో అసువులను కోల్పోయిన వీర, ధీర త్యాగులకు జోహారులను అర్పించిరి.

ఇరకం ద్వీప గ్రామంలో

## స్వాతంత్ర్య దిన మహోత్సవము

నెల్లూరు జిల్లా ఇరకం ద్వీప గ్రామంలో బాల సంఘం వారు స్వాతంత్ర్య దిన మహోత్సవము అతి వైభవంగా 15 వ తేదీ సాయంకాలం 5 గంటలకు సదరు గ్రామ మునసబు పొన్నువేలు మొదలిగారి అధ్యక్షతన జరిపారు. ఆ సమయమున నెల్లూరుజిల్లా సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకి ఇన్‌స్పెక్టరు శ్రీ. ఎం. వెంకటేశ్వర్లు గారు జాతీయ పతాకము యెగురవేశారు. గ్రామ ప్రణాళిక సంఘాధ్యక్షుడు, డా॥ జీ. ఆర్. కన్నయ్య నాయుడు స్వాతంత్రదిన ప్రాముఖ్యతను ప్రశంసించి సమావేశమైన పెద్దలకు పిల్లలకు జెండాలు, పెప్పరమెంట్లు పంచిపెట్టారు.



# విశాఖ జిల్లాయందలి ప్రథమ సంక్షేమ విస్తరణ ప్రణాళిక ద్వితీయ వార్షికోత్సవము

విశాఖ పట్టణము: ఈ జిల్లాయందు స్థాపింపబడిన ప్రథమ సంక్షేమ విస్తరణ ప్రణాళిక వార్షికోత్సవము ఆగస్టు 14వ తేది బాలచెరువు గ్రామమునందు జయప్రదముగ జరిగినది. ఈ సభకు జిల్లాకలెక్టరు శ్రీ ఎన్. జి. కామత్ అధ్యక్షత వహించినారు. శ్రీమతి శాంతి. జె. కామత్ పతాకోత్సవము జరిపి పిల్లలకు బహుమానములు పంచినారు. కన్వీనరు శ్రీమతి దిగుమర్తి జానకీబాయమ్మ వార్షిక నివేదికను సమర్పించినారు. శ్రీ దిగుమర్తి రామస్వామిగారు ప్రణాళికను గూర్చియు, ప్రజల సహకారమును గూర్చియు ప్రజలకు బోధపర్చినారు. జిల్లా కలెక్టరు కేంద్రమును, కేంద్రమందుగల వస్తు సామగ్రిని చూచి పిల్లలకు పెద్దలకు కావలసిన విజ్ఞాన వినోద, వికాస కార్యక్రమములకు కల చక్కని యేర్పాట్లను చూచియు ఎంతయు శ్లాఘించినారు. ఈ యుత్సవము జయప్రదముగా జరుగవలెనని ఆశించుచు మధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ భోగరాజు పట్టాభి సీతా రామయ్య గారు, ప్లానింగ్ మంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు, మాజీ గవర్నర్ జనరల్ శ్రీ రాజగోపాలచారి గారు యునిసెఫ్ రిప్రజెంటేటివ్ శ్రీ సి. కొండాపిగారు ఆంధ్రరాష్ట్ర సంక్షేమసంస్థ అధ్యక్షులు శ్రీమతి ఎ. సి. కృష్ణారావుగారు ఆశీః పూర్వక సందేశములను పంపియున్నారు. బాలబాలికలు అనేక వినోద, నృత్య ప్రదర్శనలు గావించి ప్రజలకు ఆనందము కలుగజేసినారు, బాలబాలికలకు మిఠాయిలను పంచుటతో సభ జయప్రదముగా ముగిసినది.

## స్వాతంత్ర్య దినోత్సవము.

శ్రీహరి పురమునందలి మాతా శిశుసంరక్షణాలయమునందు స్వాతంత్ర్య దినోత్సవము జరుపబడినది. పతాకోత్సవము శ్రీ దిగుమర్తి రామస్వామిగారిచే గావింపబడినది.

పిమ్మట స్వతంత్ర దినముయొక్క విశిష్టత, మనదేశ నాయకులు ఆ స్వాతంత్ర్యమును ఎటుల సాధించినది వారి చరిత్ర మున్నగు విషయములపై శ్రీ రామస్వామిగారు ప్రసంగించినారు. బాలబాలికలకు మిఠాయిలు పంచినారు. ప్రజలు సంక్షేమ సంస్థతో సహకరించుటకు వాగ్దానమిచ్చినారు. సభ జయప్రదముగ ముగిసినది.

## పిల్లల సంక్షేమశాఖ

ఇచ్చటగూడ స్వాతంత్ర దినోత్సవము జరుపబడెను. సమాజ కల్యాణ కమిటి సభ్యురాలగు శ్రీమతి జి. కమలమూర్తిగారు అధ్యక్షులు. జాయింట్ కన్వీనరు శ్రీ దిగుమర్తి రామస్వామిగారు స్వతంత్ర సమరచరిత్రను స్పష్టముగా స్త్రీలకు వివరించి స్వరాజ్య స్వరూప నిరూపణ యెట్లుండ వలయునో, భారతజాతి పితయగు మహాత్మాగాంధిగారు వాంఛించిన రామరాజ్యమునెట్లు సాధించగలమో, అన్ని హంశములను వివరించి చెప్పిరి. అధ్యక్షురాలు యూరప్ ఖండములోనిమహిళలు తమ గృహపారిశుధ్యమును, కుటుంబ సౌకర్యముల నెంత శ్రద్ధగా కాపాడుకొనుచున్నారో బోధించిరి.




## తేనె వెల్లువలు

| రచన | వెల |
|---|---|
| శ్రీ వాడ్రేవు చలమయ్య | 0-12-0 |

శీర్షికానుగుణ్యంగా ఈ కావ్యరస మనే మధువు వెల్లువగానే ప్రవహించింది. ఈ కావ్యకర్త ప్రధానముగా భావ సౌందర్యముకు సరళశైలికి యత్నించి సఫలీకృతులైరి.

వారుఅప్పటప్పట రచించిన ఖండకావ్యముల సంపుటియే ఈ తేనెవెల్లువ. రచయితసహజముగ చిత్రకారులు. అందుచేత ఇందలి పాత్రలను చిత్తరువులవలె పద్యములతో లిఖించారు.

ప్రాప్తిస్థానము. శ్రీ వాడ్రేవులచలమయ్య, టవున్‌హాలు వీధి. విశాఖపట్నం.

—శ్యామల.

## మానవదర్శనము

రచయిత : ధనకుధరం వరదాచార్యులు.

ప్రాప్తిస్థానం : శ్రీ వైద్యవిద్యా సంస్థానము.

ఆలపాడు - గుంటూరుజిల్లా

భగవంతుని యొక్క సృష్టిజాల మంతటిలో మానవ సృష్టి అద్వితీయ మైనది. అతడు తన బుద్ధిబలము నుపయోగించి సృష్ట్యాదినుండి పరిశోధనము సాగించుచునే యున్నాడు. మానవుడు చతుర్విధ పురుషార్థములను సాధించి సుఖజీవనమును గడపుటయే జీవిత పరమావధి. ఈ పరమార్థమును బోధించుట కేర్పడినవే వేదములు పురాణములు మొదలైన గ్రంథములు.

మన ప్రాచీన సంప్రదాయము లన్నియు మానవుని బుద్ధిని సంస్కరించి జ్ఞానోదయము కలిగించి అతడు పెడమార్గమున బడకుండునట్లు చేయుటకే యేర్పడినవి. సంప్రదాయము లెన్నియున్నను, సంస్కృతి యెంత గొప్పదైనను మానవులు దానిని గుర్తించక పోయిన యెడల దానియునికి నిష్ఫలమేయగును. ధనకుధరం వరదాచార్యులుగారు వ్రాసిన "మానవ దర్శనము" అను గ్రంథము బుద్ధిమంతులు చక్కగా చదువుకొని, ఇహపర సాధనముగ జీవితమును సరిదిద్దుకొందురుగాక.

## జలపాతము — కథాసంపుటి

"ఉజ్వలభావుక "దార్శనిక కథక"

పులిపాక జగన్నాథరావుగారు.

ఆంగ్లభాషాశాఖ — హిందూకళాశాల - గుంటూరు

"జలపాతం" అనే ఈ చిన్ని పొత్తమునందున్న కథలన్నియు ఉదాత్తమైన ఆశయాలతో, ఉత్తమ మనస్తత్వాన్ని నిరూపించునవిగా జగన్నాథరావుగారు చిత్రించారు. ఈ కథలు మిక్కిలి చిన్నవిగా నున్నప్పటికిని చదువరులకు ఉత్సాహమును, సున్నితమైన నీతిని బోధించుచున్నవి —

## సమాగమము

పద్యకావ్యము

శ్రీమతి వసంతకుమారీ దేవి.

సాహితీ సమితి - రేపల్లె

"సమాగమ"మను నీ పొత్తమున గౌతమ బుద్ధుని చరిత్రము ప్రతిపాదింపబడినది. యశోధరా దేవికి పూర్వస్మృతు లుద్భవములై భావాంబర వీధిని కదలినట్లు రచించిన యీ విధానము హృదయంగమముగా నున్నది.

నెయ్యము నివేదన, నిష్క్రమణము, నిరీక్షణము, సమాగమము" అను పంచరత్నములతో ఈ చిన్ని పొత్తము సారస్వత లోకమున శిరోభూషణమై వెలయుచున్నది.

## "మనది ఒక కుటుంబము"

కేంద్ర ప్రభుత్వము తరపున రైల్వేశాఖకు చెందిన మంత్రి వర్గమువారు ప్రకటించిన ఈ పుస్తకము మా కార్యాలయమునకు చేరినది. ఇందు ప్రథమ పంచ వర్ష ప్రణాళికా కాలమున రైల్వేవారొనరించిన అభివృద్ధి కార్యక్రమములు వివరింప బడినవి.

జి. సుందరీ శంకరం.

## మన ఐక్యత గ్రామ ఆరోగ్యం

ప్రవక్త : వినోబా అనువాదం : లవణం

ప్రకాశకులు

సర్వోదయ సాహిత్య ప్రచారసమితి

భూదానకుటీరం - హైదరాబాదు — 1.

ఇందు గ్రామప్రజల సమైక్యత, పరస్పర అన్యోన్యత ఎంత అవసరమో రచయిత రమ్యంగా రచించారు. గ్రామాన్ని ఒక కుటుంబంతో సరిపోల్చి అందరి ప్రజలను ఏక కుటుంబ జనితులుగా రూపొందించేరు. పరస్పరవిభేదాలు గ్రామానికి గ్రామీణులకు ఎంత బాధా కరమో, నష్టకరమో వివరించేరు. పల్లెలలోభూమిపై పల్లీయులందరికీ సమాన హక్కుందనీ, పత్రాలతో కేవలం హక్కును రుజువు చేసుకోలేరనీ మున్నినంత మాత్రాన తనదైపోదనీ మొత్తం గ్రామీణులందరూ ఐకమత్యంగా భూమిని సాగుచేసి ఫలితాన్ని సమానంగాఅనుభవించాలనీ ఎన్నో గ్రామసౌభాగ్యోదయమునకు తోడ్పడే అవకాశములను పేర్కొన్నారు. అనువాదకులు కూడా ఎంతో ఒద్దికతోపేరిన శైలిని వాడుటచే పల్లీయులాది పట్నవాసము వారివరకు సులభ గ్రాహ్యముగా అమరింది. మౌల్యం 0-3-0

## వినోబా జీవితం

ప్రకాశకులు

భూధాన సాహిత్య ప్రచార సమితి

హైదరాబాదు. మౌల్యం 0-6-0

**తపోనిధి, విజ్ఞానిఅయిన మానవరూపుడు** శ్రీ వినోబా బావేను గూర్చి సంగ్రహముగా తెలుసుకోవాలనే వాంఛ ప్రతీ భారతీయునకూ సహజము అట్టివారికి లవణం వ్రాసిన వినోబా జీవితం ఎంతో సంతృప్తిని కలిగిస్తుంది. ఆదినుండి అంతమువరకూ పఠితలు పుస్తకమును చేయి వీడక తదేక దీక్షతో చదివి ముగిస్తారు.

—ఇంద్రాణి

## ఆంధ్ర ప్రదేశ్ యువ కర్షక సమితి

విశేష సంచిక

ఆంధ్ర ప్రదేశ్ యువ కర్షకసమితి ప్రారంభ సమావేశ సందర్భమున సేకరించిన వ్యాసముల సంపుటియే ఈ సంచిక.

కర్షక యువకులనందరినీ దేశపునర్నిర్మాణ కార్యక్రమములలో ఇతోధికమైన, సమధికమైన, ఉత్సాహంతో పాల్గొనునట్లు ప్రోత్సహించడం, రైతులలో విజ్ఞానవికాస వృద్ధికి అవసరమైన కార్యక్రమాలను అమలు జరపడం వంటి పవిత్రమైన ఆశయాలతో ఈ సమితి ఉద్భవించింది.

భారత కర్షకోద్యమంలో ఆంధ్రరైతుల ముందంజను గూర్చి ఆచార్యరంగా, కర్షకయువకులలో స్వవృత్తిపట్ల గౌరవభావాన్ని పెంపొందించాలి అని శ్రీ జి. ఉమామహేశ్వరరావు. భారతసేవక సమాజం గురించి డాక్టరు పరుచూరి వీరయ్యచౌదరి అందలి మహిళాశాఖ నిర్వహిస్తున్న సేవా కార్యక్రమాలను గూర్చి శ్రీమతి అవుల జయప్రదాదేవి, యువకుల చదువులకు ఉద్యోగాలే పరమ ధ్యేయమన్నభావం పోవాలని శ్రీమతి భారతీదేవిరంగా మొదలైనవారు వ్రాసిన వ్యాసములిందు చక్కగా పొందు పరచబడినవి.

సాంఘిక సంక్షేమం, కర్షక యువకుల విధ్యుక్త ధర్మము, వ్యాధులను గూర్చిన మూఢ నమ్మకాలు మొదలైన వ్యాసములే గాక, ప్రముఖుల ఆశీర్వాదములు ప్రారంభోత్సవమందలి ఉపన్యాసములూ, అనేక చిత్రములతో ప్రచురింపబడి బహుసుందరముగా ఈ విశేష సంచిక సమకూర్చ బడినది.

"ప్రభుత్వంవేరు మనం వేరు కాదు" "హక్కులతోపాటు బాధ్యతలు" "కృషికే ప్రముఖస్థానం" అనే నినాదాలు ఇందులో విపులీకరింప బడినవి.

ఈ కర్షక యువజనసమితి అధ్వర్యాన నడుప నుద్యమించిన పత్రిక త్వరలో వెలువడి, కర్షకలోకాన్ని సర్వవిధాలా ఉద్ధరించి, దేశాభ్యుదయానికి తోడ్పడ గలదని ఆశించుచున్నాము. "సుభాషిణి"

---

మీ చిన్న మొత్తములను దాచుట ద్వారా పెద్ద పెద్ద కార్యాలను సాధించగలరు






*



"To train women workers and harness their services in the building up of the future of our Nation and Womanhood"

## సెప్టెంబర్ 1956

| ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| 30 | • | • | • | • | • | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |

8. వినాయకచవితి, 16. వామనజయంతి, 18. అనంతవ్రతం, 22. ఉండ్రాళ్ళతద్దె.

**ANDHRA MAHILA SABHA**

MYLAPORE : : MADRAS 4.

Edited, Printed & Published by Mrs. K. Lakshmi Raghuram, B.A., at the Andhra Mahila Press, Mylapore, Madras 4.